[illegible] ర్త:

[illegible] కుమార వేంకట సూర్యప్రకాశరావు



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1954

టు రిజిష్టర్డు ] [ వెల 1—0—

# విషయసూచిక



ఓం

అవిఘ్నమస్తు

శ్రీరామాయనమః

# తెనాలిరామకృష్ణకవిచరిత్రము

## జననము

తెనాలి రామకృష్ణకవి పేరు వినిన యాంధ్రుడుండడు. ఈకవి కృష్ణామండలములోని తెనాలి యను యగ్రహారమున జన్మించెను. ఈతనితల్లి లక్ష్మమాంబ తండ్రి రామయామాత్యుడు. యాజ్ఞవల్క్య బ్రాహ్మణుడు. కౌండిన్యసగోత్రుడు. రామకృష్ణకవి తన్నుఁ గూర్చి పాండురంగ మహాత్మ్యమునం దిట్లు వ్రాసికొనియున్నాఁడు.

క. నను రామకృష్ణకవిఁ గవి
జనసహకారావళీవసంతోత్సవ సూ
క్తినిధిఁ బిలిపించి యర్ధా
సనమునఁ గూర్చుండబనిచి చతురత ననియెన్.

సీ. నలుదెఱంగుల కావ్యనవసుధాధారల
ఘనుఁడా వాశువునందుఁ గరముమేటి
నఖిల భూమీపాల కాస్థానకమలాక
రోదయతరుణ సూర్యోదయుఁడవు
శైవవైష్ణవ పురాణావళీ నానార్థ
రచనాపటిష్ఠైక రమ్యమతివి
లౌకికవైదికలక్షణ చాతుర్య
ధైర్యప్రభారాఢ కార్యచరణుఁడ

గీ. నాంధ్రభూమీ కుచాగ్రహారాభమైన
శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేతవగ్ర
శాఖికాకోకిలమవీవు సరసకవివి
రమ్యగుణకృష్ణ రామయ రామకృష్ణ

క. కౌండిన్యసగోత్రుఁడవా
ఖండలగురువిభుఁడ నఖిల కావ్యరససుధా
మండనకుండలుఁడవు భూ
మండల వినుతుఁడవు లక్ష్మమాంబరతనయా.

క. యశము కలిగించు నీమృదు
విశదోక్తులఁ బౌండరీకవిభుచరితుఁ జతు
ర్దశభువన వినుతముఁగ శుభ
వశగతి నాపేర నడుపు వరతత్వనిధీ.

ఉ. స్కాంధపురాణ వీరనిధికౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందను సత్కథోద్యమము నవ్యకవిత్వకళాకలాపమున్
కుందనమున్ ఘటించు, కడుఁగొత్తగు సొమ్మునరించి విష్ణుసే
వందిలకించు నప్పురమువైష్ణవకోటి నలంకరింపుమా.

మ. ఉదయంబ స్తనగంబు సేతువు హిమవ్యూహంబునుం జుట్టిరా
విదితంబైన మహిన్మహాంధ్రకవితా విద్యాబలప్రౌఢి నీ
కెదు రేరీ సరసార్థబోధఘటనా హేలాపరిష్కార శా
రదనీరూపము రామకృష్ణకవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా!

తెనాలిరామకృష్ణకవి క్రీ.శ. 1505 సం॥రమునకుఁ బూర్వము వాఁడని చరిత్ర వాకొనుచున్నది. శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునఁ బేరుగన్న యష్టదిగ్గజములలో నీతఁ డొకడని చెప్పుదురు. అల్లసానిపెద్దన, నందితిమ్మన, అయ్యలరాజు రామభద్రుఁడు, ధూర్జటి

కాకమాను రామరాజ భూషణుడు, ప్రౌఢకవి మల్లన్న, పింగళి సూరన్న తెనాలి రామకృష్ణకవి—వీ రష్టదిగ్గజములని కీర్తిగాంచిరి.

---

## 2 బాల్యము

రామకృష్ణకవి బాల్యావస్థలో నున్నపు డపరిమితముగ నల్లరి సేయుచు తలిదండ్రులమాట పాటింపక తిరుగుచుండెను. ఈతఁడొక నాఁడు కొందరు బాలురతోఁ కలిసి యాటలాడుచుండగా, నామార్గ మున బోవుచుండిన సిద్ధుఁడొకఁడాగి, రామకృష్ణుని ముఖమువంక తదేకదృష్టిగఁజూచి, రమ్మని పిలచి యిట్లనెను—ఓ బాలుఁడా! నాతో దూరము వత్తువేని నీకు మేలు కలిగించెదను.

రామకృష్ణుఁ డాసిద్ధునియెడల గౌరవయుక్తుఁడై యనుస రించెను. కొంతదూరము గొనిపోయి యాసన్యాసి, ఓబాలుడా నీ ముఖమున నసాధారణమగు తేజముప్రస్ఫుటమగుచున్నది. నీకు గాళికామంత్రము నుపదేశింతును. భక్తి యుక్తుడవై, దేవి యాలయ మునకు బోయి గర్భగుడిలో గూర్చుండి, జపింపుము. నీకు మేలు కలుగును. అనియొకమంత్రము నుపదేశించి వెళ్ళెను.

రామకృష్ణుడు నిర్భయచిత్తుడై కాళికాలయమునకు బోయి యేకాగ్రచిత్తముతో నామంత్రమునుజపింపగా, దేవి సంతుష్టినొంది సాక్షాత్కరించెను. దయార్ద్రహృదయమై దేవిప్రత్యక్షమైనంతనే రామకృష్ణకవి భక్తియుక్తుడై ధ్యానించుటకుమారుగ పక్కునవ్వెను. కాళికాదేవి యాగ్రహమునొంది 'ఏమిరా'నన్ను చూచి నవ్వెదవు అని గర్జించెను. భయభక్తులు తన్ను ముప్పిరిగొన నాతడు 'అమ్మా! నన్ను క్షమింపుము నేను నీదాసుడను, నీరూపము చూడగానే నా చిత్తము సందేహాయత్తమైనది' అనెను.

'అ సంశయమేమి?' అని దేవి ప్రశ్నింప, రామకృష్ణుడు తల్లీ! మాకు పడిశము బట్టినచో రెండుచేతులతోను బాధపడుచున్నను జాలుబలేదే సహస్రశీర్షములుగల నీకు పడిశము పట్టినచో నెట్లు బాధపడుదెవోయని నవ్వువచ్చినది. అని బదులుచెప్పెను. అతని పరిహాసమునకు బ్రమాదంబంది దేవి 'రామకృష్ణా! నీవు వికటకవివై ధనయశస్సముపార్జన మొనరింతువు' అని యంతర్థానమయ్యెను.

కాళికాదేవి యొకగిన్నెలో క్షీరమును, మరియొకగిన్నెలో పెరుగును బోసి, 'దీనిలోనీకేది కావలయు?'నని ప్రశ్నింపగా నాతడు అమ్మా! ఆపాత్రలను నీచేతిలోయుంచుకొనియడిగినచో నేనేమిచెప్పుదును? అని వానినందుకొని 'ఇదియేమి?' అని ప్రశ్నింపగా, దేవి ఇది విద్య, ఇది ధనము, ఈరెండింటిలో నీకేమి కావలయునో తీసుకొను' మనెను. రామకృష్ణుడు 'అమ్మా! విద్యయుండి ధనములేని మనుజులకు మర్యాదయుండదు. దారిద్ర్యానలమున మ్రగ్గిపోవుచు నెవడును గ్రంథములరచించి విద్యావ్యాప్తికి తోడ్పడజాలడు. కావున విద్యాధనములురెండును మానవున కవసరమే'యని పాలును పెరుగును కూడత్రాగివైచెను.

అతని సాహసమున కచ్చెరువంది దేవి 'రామకృష్ణా! నీకవిత్వము శాశ్వతమై ఆచంద్రతారార్కమై వెలయుగాక'యని దీవించి మాయమయ్యెనని కొందరు చెప్పుదురు.

---

## 3 ఆస్థానమున బ్రవేశించుట

విద్యానగరమున కేలికయైన సాళువనరసరాయలు దేశసంచార మొనరించుచు తెనాలినొకసారి చూడబోయి యచ్చట పాఠశాలకరి

గెను. ఆ బాలురందఱిని గూర్చుండ నియమించి, నరసరాయలు 'బాలురారా! మీలో తెలివిగలవారెవరో లేచి నిలువఁబడుఁడు' అనెను. అందఱును ఒకరిమొగము లొకరు చూచుకొనుచు నూరకుండిరి. రామకృష్ణుఁడు లేచి నిలువబడెను. నరసరాయ లిట్లు ప్రశ్నించెను— 'అబ్బాయీ! అందఱును మాఱుమాటాడక కూర్చుండియుండగా నీవేల లేచి నిలువఁబడితివి?'

రామకృష్ణుడు ధైర్యముగా 'అయ్యా! ఎవరు తెలివిగలవారో లేచి నిలువబడుఁడు అనికదా ప్రశ్నించిరి. అందఱును దెలివిహీనులవలె గూర్చుండిరి. ప్రతివారికిని గొంచెమో గొప్పగనో తెలివి యుండి తీరునుగాని యుండకపోదు. ఈ బాలురందఱును దమ తెలివి గుర్తింపనేరని మూఢులుగాన మాటాడక యూరకున్నారు. నేను తెలివిగలవాడనను ధైర్యము నాకు గలదు గాన నిలువబడితిని' అని పలికెను.

నరసరాయలు విస్మయపరిచేతస్కుఁడై, యాతడు వృద్ధిలోనికి రాగలడని తలంచి ఓయీ! నీకేదైన జిన్నయుద్యోగ మిప్పింతును. నాతో వత్తువా?' యని ప్రశ్నింప నాత డంగీకరించి తలిదండ్రులతో కలిసి యాతని ననుసరించి చనెను. తెనాలికి సమీపముననున్న బట్టుపల్లె యనుగ్రామములోని బట్రాజుల సాంగత్యముచేసి రామకృష్ణుడు కవిత చెప్పుటయందు ప్రావీణ్యము సంపాదించెను. రామకృష్ణుడల్లసాని పెద్దనయను కవీంద్రుని దర్శించి, యాతడు సంతసించున ట్లీక్రింది పద్యము రచించి చదివెను—

క. నలుగురు నినుఁ బలుమాఱున్
గెలుతురు సుగుణోక్తికి కాంతికీర్త్యాకృతులన్
నలుగురు నినుఁ బలుమాఱున్
భళిభళియన కచ్ఛరంగ పాండురరంగా!

నాఁటగోలె పెద్దనకవీశ్వరుఁడు రామకృష్ణునివిషయమై రాయలతోఁ జెప్పి యాస్థానకవిగా బరిగణింప వలసినదని కోరెనని చెప్పుదురు. కొందఱు నందితిమ్మనకవీంద్రు నుద్దేశించి రామకృష్ణుడు.

క. 'నీకవితామాధుర్యం
బేకవులకు గలుగ నేర్చునే కూపనట
ద్భేకములకు నాకధుని
శీకరములచెమ్మ ! నందిసింగయతిమ్మా'

యని చదివెనట. అంత నా నందితిమ్మన్న కవీంద్రుడు పరమానందభరితాత్ముండై తనకు శ్రీకృష్ణదేవరాయలు బహుమానముగ నొసంగిన శాలువ నిచ్చెను. ఆశాలువ ధరించి, రామకృష్ణుడాస్థానమునకుఁ బోయెను. రాయలు రామకృష్ణుడు ధరించియున్న శాలువా చూచి 'కవిచంద్రమా! నీ కియ్యది యెట్లు లభించినది?' అని ప్రశ్నింపగా తనపద్యమునకు సంతోషించి, నందితిమ్మన్న యీ పచ్చడము నొసంగెనని చెప్పి యీపద్యము జదివెను. రాయలు సంతసించి రామకృష్ణుని సన్మానించెనట.

---

## 4 ధూర్జటి కవి

ఆస్థానకవులందరిలో కృష్ణదేవరాయలకు ధూర్జటికవిపై నత్యధికమగు ప్రీతిఁగలిగియుండెను. కవితాగోష్ఠి సలుపునపుడు రాయలు తఱచుగా ధూర్జటి కవిత్వమును గూర్చియే ప్రశంసించు చుండెను. ధూర్జటి పైకి పరమశ్రోత్రియుడుగా గన్పట్టుచు రహస్యముగా వారాంగనాలోలుఁడై మెలగుచుండెను. అట్టి మహాకవి యనినీతివర్తనుడై మెలగుచు భార్యమోము చూడకుండుటచే నెట్లయిన యాతని వేశ్యానురక్తి తొలగజేయవలయునని పెద్దనాదులందరు నిశ్చయించుకొని, రామకృష్ణకవితో 'ఇది నీవల్ల జరుగవలసిన పనిగాని మావలన

జరుగదు అని చెప్పిరి. సరేయని రామకృష్ణుడు తగిన యదనుకై నిరీక్షించుచుండెను.

రాయలొకనాఁడు కొలువుకూటమున నున్న కవుల నందరను దిలకించి యిట్లు సమస్యనిచ్చి పూరించుమనెను.

'చ. స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల కల్గెనో
యతులిత మాధురీమహిమ......'

రామకృష్ణకవి లేచి యిట్లు పద్యములోని మిగిలిన భాగము పూర్తిచేసెను.

......హా తెలిసెన్! భువనైక మోహనో
ద్ధతసుకుమారవార వనితాజనతా ఘనతాపహారిసం
తతమధురాధరోదితసుధారసధారలఁ గ్రోలగాఁజుమీ!

వారాంగనపాన మొనరించుటచేతనే ధూర్జటి కవిత్వ మంత రసవంతమై యున్నదను భావము నలుగురకు బోధపడుటనే ధూర్జటి సిగ్గుపడి వికటకవి నేమియు ననఁజాలక యూరకుండెను. రాయలు ధూర్జటిని కొన్నిరోజులైనపిదప నంతఃపురమునకుఁ బిలిపించి, వేశ్యా సహవాసము మానుమని మందలించెను.

---

# 5 దొంగలచే నీరు తోడించుట

శ్రీకృష్ణదేవరాయ లొకప్పుడు ఖైదీలను బరీక్షించుటకై కారాగృహమున కేగెను. అపరాధులందరును దమతమ యపరాధములను రాయల కెరిఁగించుచుఁ దమకు నిర్బంధవిమోచనముఁ గలిగింపుమని ప్రార్థించుచుండిరి. ఇరువురు దొంగలు రాయలు తమ్ము 'మీరు చేసిన యపరాధములఁ దెలుపు' డనినంతనే యిట్లు చెప్పిరి. మహారాజా! మాకు చౌర్యమున నద్భుతము ననుపమానము నగు నేర్పు కలదు. మేము గజదొంగలము. ఈవృత్తిని మానుటము

మమ్ము క్షమించి విడిచిపుచ్చుడు. తమరు మాకు చౌర్యమున గల గౌశలమును బరీక్షింపవచ్చును.

రాయలు 'సరే' మీరు నేటిరాత్రి రామకృష్ణకవి యింట నెవరికిని బ్రమాదము గలుగకుండ నేదైన యపహరించి గొనితెండు పట్టుబడినచో మీకు విముక్తి యింతలో లేదుగాని జయప్రదముగ చౌర్యమొనరించినచో మీకు విమోచనము గల్గితును' అనెను. వల్లెయని యాచోరాగ్రేసరులు రాత్రి బాగుగా చీకటిపడిన పిదప రామకృష్ణకవి యింటిప్రహరీగోడ దాటి లోనబ్రవేశించి, చిక్కుడు పాదుక్రింద దాగొనియుండిరి.

రామకృష్ణకవి భోజనము చేయుటకు ముందు పాదప్రక్షాళనార్థము దొడ్డిలోనికి వెళ్ళి చిక్కుడుపాదుక్రింద నక్కియున్న దొంగలనుజూచి, లోనికివచ్చి భార్యనగలన్నింటిని భద్రముగ దాచి, భోజనానంతరము తిరిగి దొడ్డిలోనికి వెళ్ళి చేయి కడుగుకొనుచు బిగ్గరగా 'నేమే దొంగలు మనయూరునిండ నిండియున్నారు. నీనగలనుమూట గట్టి యిమ్ము. నూతిలో బారవేసినచో చోరులకు శక్యముకాదు' అని యొకటి రెండు పెద్దరాళ్ళను మూటగట్టి నూతిలో పడవైచి, తలుపువేసికొని, కొంతసేపైనతరువాత మరొక మార్గమున దొడ్డిలో బ్రవేశించి, చోరులచేష్టల గనిపెట్టుచుండెను.

ఒకరు నూతికడ నిలువబడియుండగా, నింకొకడు బావిలోనికి దిగి చాలసేపు వెదకి యానగలమూటను కనుగొనజాలక పైకివచ్చి 'ఓరన్నా! బావిలో జల మధికముగా యున్నది. కొంతమైన నీరు తోడివైచినగాని మూటకనబడుటదుర్లభము' అనెను, ఇరువురునుకలసి, ఏతముతోడుటకారంభించిరి. ఎంతతోడినను నీరు తరిగినట్లు గాన్పించకుండెను. రామకృష్ణుం డెట్టియలుకుడును జేయక మడులుత్రవ్వి యా దొంగలు తోడిననీరు పూలమొక్కలన్నింటిని దడుపునట్లు చేసెను.

తెలతెలవారుచుండెను. ఒకదొంగ మఱల బావిలోనికి దిగి వెదకి వెదకి మూటను పైకిదీసివిప్పెను. అందు రాళ్ళు కన్పింపగానే దొంగలు నిస్పృహచెంది రామకృష్ణకవి తమకు తగిన ప్రాయశ్చిత్తమొనరించె నని వెడలిపోవునంతలో రామకృష్ణుడు ఓరీ! చోరులారా! మీ పుణ్యమా యని ఒకటిరెండు మొక్కలుదప్ప పూలమొక్కలన్నియుఁ దడిసినవి. మీధర్మమాయని యారెండు మొక్కలనుగూడ నను నంతలో దొంగలు గోడదుమికి పాఱిపోఁబోయిరి. సరిగా నావేళకా మార్గముననే బోవుచున్న రక్షకభటులు చోరులను బంధించి మఱల కారాగారమునద్రోసిరి. రామకృష్ణుడీవృత్తాంతమును రాయలకు దెలిపి, యానందము కలిగించెనట.

---

# 6 నూరు తప్పులకు ఫర్మానా

రాయలు కొలఁదిపరివారము వెంటరా, కవిబృందముతోఁ గలసి వాహ్యాళికై భద్రానదినిదాఁటి చాలదూరమరిగెను. కనిగిరి పరిపాలకుఁడైన వీరభద్రగజపతి సేనానియగుపసరము గోవిందరాజను దండనాథుఁడు రాయలను బంధించుటకిదియే తగినయదనని యెంచి, ససైన్యముగ రాయల నెదుర్కొనెను. రాయల ననుసరించియున్న కొలఁదిమంది సైనికులును గోవిందరాజు ప్రతాపాగ్ని కోపఁజాలక పలాయన మవలంబించిరి. రాయలు ధైర్యముతో కవులవంకఁ జూచి 'కవీంద్రులారా! ఈవిషమసమయమున వెనుకంజవేయరాదు. మీరు నాకు విజయము ప్రాప్తించునట్లాశీర్వదింపుడు, క్షణకాలములో గోవిందరాజును కృతాంతమందిరమున కతిథిగా నొనరించివత్తును' అని పలికి శత్రురంగమునకరిగి మెచ్చట జూచినఁ దానెయై మెలం

గుచు గోవిందరాజు సైనికులు చెల్లాచెదరగు నట్లొనరించెను. అది చూచి గోవిందరాజు రెట్టించిన క్రోధోద్రేకముతో రాయలపై గవిసెను. ఇరువురునుభయంకరముగ పోరాడుచున్న సమయమున రామకృష్ణుడుధైర్యముగ గోవిందరాజు వినునట్లీ క్రిందిపద్యములఁ జదివెను.

'క. బసవనకు బుట్టినప్పుడె
పసరము గోవిందరాజు పసరంబైనన్
గసవేటికి దినఁడనఁగాఁ
గసవుందిను శత్రులాజిఁ గదిసినవేళన్.'

ఆ పద్యము నిశితశూలమునవలె చిత్తమునకు దాకఁగాగోవిందరాజు వెంటనే రుధిరము నోటఁ గ్రక్కుకొని క్రిందబడి విలవిల దన్నుకొనుచుఁ బ్రాణములువిడిచెను. రామకృష్ణుని పద్యము విని గోవిందరాజు విగతజీవుఁడగుటతోడనే తక్కుంగల సైనికులు చెల్లాచెదరై పాఱిపోయిరి. రామకృష్ణుని మహిమకెంతయు నలరి, రాయలు 'రామకృష్ణకవీ! నీమహాత్మ్య మేనెఱుంగనైతిని. ఈవిషయమున నీవు కారణభూతుఁడవు. నీకేమి కావలయునో కోరుకొను' మనగా మన కవి యిట్లనెను—

'మహారాజా! నాపై తమకు దయయున్నఁ జాలును, నా కదియే పదివేలు. తాము కోరుకొనమంటిరిగాన యొక చిన్నవర మడిగెదను. నేను చేయు తప్పులు దినమునకు నూటిఁటివరకుక్షమించుచుండ గోరెదను. నాకది యే చాలును.

'నూరుకాదు ఎన్నితప్పులైనను క్షమింతును.' అని రాయలు వచించెను. నాటినుండి రామకృష్ణుడు నిర్భయముగఁ గొంటెపనుల జేయుచుండెను.

# 7 తాతాచార్యుల నవమానించుట

రాయలకు తాతాచార్యులవారియెడ నసమానమగు గౌరవము. రాయలమతగురువాయన. ఈతాతాచార్యులవారి జన్మస్థలము కాంచీపురము. ఈయన మహావిద్వాంసుడు. ఈయన విష్ణ్వంశ సంభూతుఁడని జనులు చెప్పుకొనెడి వారట. ఆచార్యులవారు సంస్కృతమున 'సాత్త్వికబ్రహ్మ విద్యావిలాస' మను గ్రంథమును రచించియుండిరి. చంద్రగిరిలోని వేంకటపతిరాయల సంస్థానమున కీయన తఱచుగా నేగుచుండుటచే రామకృష్ణునకు బరిచయుడయ్యెను తరువాత రాయలయాస్థానమున కేతెంచి విజయనగరముననే స్థిర నివాస మేర్పఱచుకొనెను. రామకృష్ణుడు తాతాచార్యుల వారిని దఱచుగా హేళనము చేయుచుండెను. వైష్ణవమత పక్షపాతియగు తాతాచార్యులవారు స్మార్తమతమునెడల నధికాగ్రహ్యము కలిగి యుండెను. స్మార్తుల నాయన చూడ నొల్లకుండెను. స్మార్తులు కాన్పించినపుడు మొగముపై నుత్తరీయము గప్పుకొనుచుండెను. ఇది చూచి యందరు తాతాచార్యులవారు పరమఛాందసులని చెప్పుకొనసాగిరి. రాయలుకూడ యీవార్తను గర్ణాకర్ణికగ నాలకించి, రామకృష్ణునిరావించి 'తాతాచార్యులవారు ప్రజల యసూయకు బాల్పడుచున్నారు. ఎట్లయినను వారు ఛాందసము వీడునట్లు చేయుమా' యనిరి.

రామకృష్ణు డట్లేయని యొకనాడు తాతాచార్యులవారు యింటికి వెళ్లెను. ఆసమయమునకే యాయన యీవలకు వచ్చెను. రామకృష్ణుని జూచి, యుత్తరీయము ముఖమున కడ్డుపెట్టుకొనెను. 'స్వామీ! తాతాచార్యులవారూ! నేను తమ ప్రియ శిష్యుఁడను గదా! నన్ను జూచి మీరేల ముఖమున కుత్తరీయ మడ్డుపెట్టుకొను చున్నారు!' లనియడుగ తాతాచార్యులవారిట్లుసమాధానముజెప్పిరి—

'రామకృష్ణా! నీవు నాకు ముఖ్యుఁడవుగాన నీతో నిజము చెప్పుచున్నాను. స్మార్తమతము బహు పాపిష్టిమతము. స్మార్తుని జూచిన వైష్ణవునకు మఱుజన్మమున గాడిద పుట్టుకయే సంప్రాప్త మగును గావున స్మార్తులఁజూచుట మానివైచితిని' రామకృష్ణు డప్పుడేమియు ననక యూరకుండెను. కొంతకాలము గడచిన వెనుక రాయరు కవులందఱితో గలిసి, నగరము వెలుపలనున్న యుద్యాన వనమునకు షికారువెళ్ళెను. ఉద్యానవనమునఁ జాలసేపు కూర్చుండి వారందఱు నీవలికి రాగా నచట కొన్నిగాడిదలు కాన్పించెను.

రామకృష్ణుడు ఒక్కొక్క గాడిదకడకు బోయి సాష్టాంగ దండప్రణామ మొనరింపసాగెను. రాయలును తదితరులును కడు పుబ్బునటుల నవ్వసాగిరి. రాయలు 'కృష్ణకవీ! నీకు మతిపోయినదా యేమి? ఎవరైనను గాడిదెలకు మ్రొక్కుదురా?' యనగా, రామ కృష్ణుఁడు ప్రభువర్యా! నేనెన్నడు నర్థములేని పనిచేయను. ఈ గాడిద మన తాతాచార్యులగారి మేనమామ కందాళై తిరుచూర్ణా చార్యులుగారు. ఈ గాడిద మన యాచార్యులవారి తాతయగు పర్వటం అళహసింగరాచారిగారు. తక్కుంగల ఖరములన్నియు వీరి బంధువులే వైష్ణవమతాగ్రేసరులకు వీరికి మ్రొక్కి నాయఘు వినాశ మునకై ప్రయత్నించుటయే తప్పగునా? తాతాచార్యులవారు కూడ నీ మధ్య స్మార్తుల మొగము చూచుట మానినారుసుడీ యనెను.

తాతాచార్యులు సిగ్గుపడి యా దినము మొదలట్లు చేయుట మానెను. రామకృష్ణుని యుక్తికి సంతసింపనివారు లేరు.

---

# 8 సమస్యా పూరణము

భట్టుమూర్తియను నామాంతరముగల కాకమాని రామరాజ భూషణుఁడు రాయల యాస్థానములోనున్న యష్టదిగ్గజములలో నొకడు. రాయలు రామకృష్ణునియెడ నాదరాభిమానములు గలిగి

యున్నాడని యీర్ష్యచెంది యొకనాడు సభలో నందఱు నుండగా, రామకృష్ణకవి కెట్లయినఁ బరాభవము సేయఁదలంచి యిట్లనెను.

'అయ్యా! రామకృష్ణకవీ! నేనొక సమస్య నిచ్చెదను. ఆద్దానిం బూరించి, నీవు సత్కవివని, వికటకవివని సార్థకనామధేయుండ వగుదువుగాక!' కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్.

రామకృష్ణుఁడు భట్టుమూర్తి తన్నవమానించుటకే యిట్టి సమస్య నిచ్చినాఁడని కోపముతో నిట్లు పూరించెను.

'క. గంజాయిత్రాగి తురకల
సంజాతులగూడి కల్లుచవిగొన్నావా
లంజలకొడుకా యెక్కడ
కుంజరయూథంబు దోమకుత్తుకఁ జొచ్చెన్.'

రామరాజభూషణుఁడు చిన్నబుచ్చుకొని కూర్చుండుట గాంచి రాయలు 'రామకృష్ణా! ఆపద్యము నట్లు చెప్పఁజనదు. భారతపదముగా జెప్పు'మన నతఁడిట్లు చెప్పెను.

'క. రంజన చెడి పాండవులరి
భంజనులై విరటు గొల్వఁబాలై రకటా!
సంజయ విధి నేమందును
కుంజరయూథంబు దోమ కుత్తుకఁ జొచ్చెన్.'

---

## 9 భారతరచన

అల్లాయుద్దీన్ గంగోబహామనీ భామినీరాజ్యమును, బరిపాలించిన పిదప నేదులశాహి రాజ్యమున కధికారియయ్యెను. ఏదులశాహి తాతయగు, కుతుబ్ శాహి నాదిండ్ల అప్పామాత్యుఁడు రచించిన తపతీ సంవరణోపాఖ్యానము నంకితమందెను. బాల్యమునుండియు నేదులశాహి తానుకూడ గ్రంథములకృతిభర్తృత్వము నందవలయు

నను కుతూహలము కలిగియుండెను. విజయనగర విజాపుర సామ్రాజ్యములవారి రిరువురునుగూడ సరిహద్దులగూర్చి తగాదాపడుచుండిరి. విజాపురము సరిహద్దుగా నుండవలయునని, విజయనగర సామ్రాజ్యాధిపతులును తుంగభద్రానది సరిహద్దుగానుండవలెనని ఏదులశాహియు వివాదపడుచుండిరి. ఈవివాదము తుదకు భయంకరసంగ్రామముగాఁ బరిణమించెను. ఆ రణంబున రాయలసైన్యాధిపతులు, సైనికులు కొంద రేదులశాహిచే ఖైదీలుగా పట్టుకొనబడిరి, వారి విమోచనము నకై రాయలేదులశాహితో సంధికొడంబడవలసివచ్చెను. ఇరువురు రాజ్యాధిపతులును దమకు రాయచూరు సరిహద్దుగా నుండవలయునని నిర్ణయించుకొనిరి, ఆసంధిలో ఏదులశాహి, రాయలు తన యాస్థానకవులచేభారతము వారముదినములలో వ్రాయించి, యంకితమీయవలయునని కూడ నేర్పఱచెను. ఏదులశాహి కోరికప్రకారము వారమురోజులలో భారతము పూర్తిచేయవలయునని యాస్థానకవులతో ఖండితముగాఁ జెప్పెను.

పదునెనిమిది పర్వములు గలిగి, పంచమవేదమని ప్రసిద్ధినొందియున్న భారతమును వారమురోజులలో వ్రాసి అందులో ఏదులశాహి పాండవులుగను, నాతనివిరోధియగు నైజాముల్ముల్కు కౌరవులుగను, వర్ణించి వ్రాయుట యసంభవమని పెద్దనాదులు తలపోసి, నిరాశచెందిరి. తమవలనఁ గాదనిచెప్పినచో దమకుఁ దప్పక దేవిడీ మన్నాయగునని యెఱింగిన యా కవులొకరినొకరు 'నీ వలన నేయిది జరుగవలె'నని యనుకొనితుదకుఁ తెనాలిరామకృష్ణునిసలహాయడుగుటకు నిశ్చయించుకొనిరి. నాలుగుదినములు గడచిపోయెను. పెద్దన, పింగళిసూరన్న రామకృష్ణునికడ కరిగి 'రామకృష్ణకవీ! ఇన్నాళ్ళును రాయల యాస్థానమున గౌరవముగనే కాలక్షేప మొనరించితిమి. ఇప్పుడు మీఁదుమిక్కిలి వచ్చినది. ఆదిక్కుమాలిన ఏదులశాహిపేర భారతము వ్రాయవలయునని రాయలు నిష్కర్షగా చెప్పెను. ఏమిచేయుటకును దోచకున్నది,'' అనగా, రామకృష్ణుడు 'పెద్దనకవీంద్రా!

ఇందుల కంతగా విచారింపవలయునా? ఏమివెర్రి! మీరు నిర్వి చారులై యుండిన నేను జెప్పినట్లు చేయుడు. మీమర్యాద నా మర్యాద గూడ దక్కించును. వేయిబండ్ల తాటియాకు కొట్టించి, సంచికలుగా దయారు చేయింపుడు అనెను. పెద్దన సంతోష భరి తాంతరంగుడై యట్లే చేయించెను.

ఏడవరోజున రాయల సెలవుగొని, రామకృష్ణుడు పెద్దనాది కవీంద్రులందఱితోఁ గలిసి, విజాపురమునకు బోయెను. కవుల నపరి మితముగ గౌరవించి, ఏదులశాహి భారతము కృతినొందుట కువ్వి ళ్ళూరుచుండెను. ఒకనాటి యుదయమున నాతడు కవులను రావించి సుఖాసనాసీనులగావించి యిట్లు ప్రశ్నించెను—

'పండితులారా! భారతం రచించి తెచ్చినారా?'

'రామకృష్ణుడు లేచి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

'సర్కార్! తమ హుకుం ప్రకారము పూర్తిచేసి తెచ్చినా రము వ్రాయుట వారమురోజులలోఁ బూర్తియైనదిగాని చదువుట కథమొక సంవత్సర మగును.'

'మమ్ము పాండవులుగనే వర్ణించినారా?'

'అవునట్లే వర్ణించినాము'

'మాశత్రువగు నైజాముల్ముల్కునో—'

'కౌరవులుగా వర్ణించినాము'

'అచ్చా! చాల సంతోషముగా నున్నది. అయితే ఎప్పుడు మొదలు పెట్టెదరు?'

'కాని ప్రభూ! ఒక్క సందేహముతోచి, చిట్టచివర కొంత పూర్తిచేయకుండ యుంచినాము. మాటిమాటికి మాకా సందేహము కలిగి చాలచోట్ల నేమియు వ్రాయక యట్లె యుంచినారము. ఆ సందేహము నివృత్తి చేసినచో నరగంటలో బూర్తిచేసి, వినిపిం తుము.'

'ఆ సందేహమేదో చెప్పండి.'

'సర్కార్! నైజాముల్ముల్కు గారిని, వారి సోదరులను కౌరవులుగా వర్ణించితిమి. తాము పాండవులని వ్రాసితిమి. పాండవులైదుగురు సోదరులు. ఆయైదుగురకు భార్య ద్రౌపది, తాము ధర్మరాజని వ్రాసితిమి. తమ జనానా వారిని ద్రౌపదిగా వ్రాసినాము అయితే తమ జనానావారికి భీమార్జున నకులసహదేవులనెడి మిగత నలుగురు భర్తలుగ నెవరిని వ్రాయవలయునో తోచకున్నది. ఈ విషయమై తమరెట్లు సెలవిచ్చిన నట్లు వ్రాయుదుము.'

ఏదులశాహి నాపాదమస్తకము క్రోధమనలముభంగి దహించెను. 'ఛీ తూ! అరే ఏం భారతంబే మీంది, ఒక్క ఆడదానికి అయిదుగురు మొగుళ్ళు, మాజనానాకింకా నల్గురు మొగుళ్ళు కావాలీ హైతో మీభారతం అకితమువద్దు కంకితమువద్దు వెంటనే తగులబెట్టు'డను సరికి రామకృష్ణుడు 'చిత్తము సర్కార్! అట్లే చేయించెద'నని యా నేయిబడ్డ తాటియాకులను నిశ్శేషముగం దగులం బెట్టించెను. అంతియు భస్మీభూతమయిన పిదప నేదుల శాహి కడ కరుదేగి 'సర్కార్! తమ యాజ్ఞానుసారము తగులబెట్టించితిని' అనెను. ఏదులశాహి పరమానందమును నొంది, యాపండితులకు శ్రమయిచ్చి సందులకు నొచ్చుకొని పెక్కు బహుమానములిచ్చి వీడ్కొలిపెను. రాయ లిదియంతయుం దెలిసికొని కడుపు చెక్కలగు నట్లు నవ్వెను.

---

## 10 కుంకుమ భొట్లు

చేర దేశమునుండి కుంకుమభొట్లు అనుజగద్దేశవిఖ్యాతినార్జించిన పండితుండు రాయల యాస్థానమందలి యష్టదిగ్గజములను జయించు తలంపుతో నేతెంచెను. ఆతఁడు రాయలను సందర్శించి యాస్థాన విద్వాంసులతోడి వివాదమునకుఁ దన కవకాశమిమ్మని కోరగా,

రాయలు సరేయని యొకదినము నిర్ణయించెను. వివిధబిరుదవిరాజితుండగు కుంకుమభొట్లు తమ్ము గెలచినయెడల రాయలు తమ్ము గౌరవించుట మానునని భయముఁజెంది పెద్దనాదికవులు రామకృష్ణునిఁజేరి 'వికట కవిశిరోమణీ! ఈ కుంకుమభొట్లు మనల గెలువజాలని యుపాయ మూహించి, మన గౌరవము కాపాడుమా' యనిరి.

రామకృష్ణుఁడట్లేయని, యానాటి సాయంకాలము నొకభటువలె మాఱువేషము ధరించి, కుంకుమభొట్లు బసచేసియున్న యింటి యరుగుపై గూర్చుండెను. కుంకుమభొట్లిటునటు పచారు చేయుచుండఁగా, నాతండు వినునట్లు రామకృష్ణు డీపద్యమును చదివెను—

శా. సమర్థకుమ! ధీనిబంధన విధానంక్రందనాచార్య శౌ
రమ్మన్యాచల వజ్రపాత ! జగవీరక్షాంబుజాక్షా! శర
ధ్యమ్మార్గస్థ దశాశ్వరాజ్యనమసహ్యాశోష్వ్రిద్విపాతీరభా
గుమ్మత్తారి శివంసముద్ర పురవప్రోన్మూలనాడంబరా!'

ఆపద్యము నాలకించి, కుంకుమభొట్లు 'ఈతెడెవ్వడు! వేషమును బట్టి సేవకునివలెఁ గాన్పించుచున్నాఁడు. అయినను మాట్లాడించి, చూచెదగాక, యని 'ఓరీ! నీ వెవ్వడవు? అని యడుగ నాతడిట్లు సమాధాన మిచ్చెను—

'అయ్యా! నేను తెనాలి రామకృష్ణకవిగారి సేవకుడను'

'ఓహో! అటులనా? నీవు రామకృష్ణకవిగారి పరిచారకుడవా? బాగుబాగు నీ యజమానికూడ ఆస్థానమందలి యష్టదిగ్గజములలోనివాఁడేనటకదా?'

'అవును. ఆయనకడనే నేను కవిత్వము చెప్పుట నేర్చుకొంటిని'

'సరే ఏదీ మఱియొక పద్యము జదువుము.'

మాయవేషముననున్న రామకృష్ణుఁ డీపద్యమును జదివెను.

క. నరసింహ కృష్ణరాయని
కరమరుదగు కీర్తికాంత కరిభిద్గిరిభి

త్కారి గరిభిద్గిరిగిరభి
త్కారి భిద్గిరిభిత్తురంగ కమనీయంబే.'

కుంకుమబొట్లు 'ఓరీ! ఆపద్యమున కర్థము చెప్పగలవా? యని ప్రశ్నింప, రామకృష్ణుం డిట్లుం జెప్పెను.

టీ. నరసింహ=సాళువ నరసింహరాయల, కృష్ణరాయ=అతని కుమారుడైన శ్రీకృష్ణ దేవరాయల, కీర్తి=ప్రసిద్ధి, కరభిత్=గజాసురుని వధించిన శివునివలెను, గిరిభిత్కారి=పర్వతముల పెకలించిన యింద్రుని యేనుగయగు యైరావతమువలెను, కరిభిద్గిరి=సాంబశివుని నివాసముండు కైలాసశైలమువలెను. దిరిభిత్కారిభిత్తురంగ=యింద్రుని యొక్కయు, సీశ్వరునియొక్కయు వాహనములైన యుచ్చైశ్రవము గోవృషభములవలెను తెల్లనికాంతి గల్గియున్నది.

'రామకృష్ణుని పరిచారకుడే యిట్టి యసాధారణపాండిత్యప్రకర్ష గలిగియుండగా, రామకృష్ణకవి యెట్టి ప్రజ్ఞాధురంధరుండో, యష్టదిగ్గజములం దగ్రగణ్యుండై యొప్పు పెద్దనముందు నే నసలు నిలువబడగలనా' యని తలంచి యధైర్యమునొంది, యారాత్రి యేరికిని దెలియకుండ నెటకో వెడలిపోయెను.

మఱునా డాస్థానమున రాయలుకూర్చుండి, కుంకుమభొట్లు నాహ్వానించుటకై భటులనంపగా వారు తిరిగివచ్చి 'మహారాజా! ఆ పండితుడు గతరాత్రముననే నగరమువిడిచి వెడలిపోయెనట' యని చెప్పిరి. రామకృష్ణుడు తానొనరించినదంతయు నెరింగింపగా రాయలు మిక్కిలి సంతోషించి సన్మానించెను. తమ యాందోళనము బాపినందులకు పెద్దనాదులెల్లరును రామకృష్ణకవిని విశేషముగా నభినందించిరి.

---

## 11 ప్రెగడరాజు నరసరాజు

ప్రెగడరాజు నరసరాజనుకవి యొకప్పుడు కృష్ణదేవరాయల యాస్థానమునకేగి 'మహారాజా! తమ యాస్థానముననున్న పెద్దన్న'

ధూర్జటి, రామరాజభూషణుడు మున్నగు కవులందఱికంటె మిన్నగ నాశుకవిత్వముం జెప్పుదును వారిపద్యములందుఁ దప్పులుపట్ట చూపింతును. ఎట్టిపద్యమైనను, ఎంతకఠినముగానున్నను దప్పులేకుండ వ్రాసి చూపింతును, అని చెప్పెనట రాయలు సరేయని సమ్మతించెను. పెద్దనాదికవు లొకరిమొగమువంక నొకరు చూచుకొనుచుండ, రామకృష్ణకవిలేచి, 'అయ్యా! నరసరాజకవీ! గొప్పవ్రాఁతకాఁడనని చెప్పుచున్నావు? నేను చెప్పు పద్యమును వ్రాసెదవా?అని యడిగెను.

'ఓహో! నిస్సంశయముగా వ్రాయుదును.'

రామకృష్ణుఁ డంతట నీక్రింది పద్యమును జదివెను.

''క. తృవ్వట బాబాతలపై
బువ్వట జాబిల్లి వల్వబూచట! చేదే
బువ్వట చూడగను హాళు
క్కృవ్వట తలఁపంగ నిట్టి హరునకు జేజే''

చిత్రోచ్చారణముగల యాపద్యమును నరసరాజు వ్రాయజాలక పోయెను. ''సరే! వ్రాతలోని నీ పస తేలిపదింక మఱొక్కపద్యము జెప్పెద నర్థము చెప్పు''మని రామకృష్ణుఁడీపద్యము జదివెను.

''మ. కన నీహారగు పద్మపత్రధళరంగ తీకార్తి! చాఋూకమ
ద్ధనశుక్రాక్షిక ళీభరాణ్మృగపతీ! త్రైలోక్యదామోదరా
యనగా శంకర వాంఛితార్థకృపదివ్యాస్తోకం పాణీజనా
ర్థన వాహిప్రద! వైరివిగ్రహముకుందా! మిత్రవింధాధిపా!''

నరసరాజు ''రామ రామ! ఇటువంటి యపశబ్దములను వినిన పాతకము వేయిజన్మములకైన తొలగదు'' అనగా రామకృష్ణకవి ''ఓహో! ఈ మారు నీపాండిత్యమంతయు వెల్లడియైనది, సుశబ్దములు నీ కపశబ్దములయ్యెనా? సరే నేనర్థము చెప్పెద నాకర్ణింపుము.

టీ. కనన్=చూడగా, నీహార=హిమమువలె, గు=తేజరిల్లుచున్న, పద్మపత్ర=తామరపత్రములవలె,ధళ=తెల్లనైన, రంగత్=ఒప్పుచున్న,కీర్తి=ప్రశస్తిగలవాడా, చాణూరమత్=చాణూరుఁడనువానిని,హాన=వధించినవాడా, శుక్రాక్షికళ=తెల్లనైన నేత్రములుగల కాళిందుఁడకు, ఇభరాట్=గజరాజునకు,మృగపతీ=సింహమైనవాఁడా,త్రైలోక్య=మూఁడులోకముల,ధామ=నివాసస్థానమైన,ఉదరా=ఉదరముగలవాఁడా,శంకర=శంకరునియొక్క,పాదపద్మయుగ,దివ్యాస్తోకపాణే=పాదపద్మముల భజించు, కరములతో=నొప్పువాఁడా, అనగా=అని చెప్పఁగా,జన=జనులయొక్క,అర్థ=కోర్కెల, నవ=క్రొత్తవైన,హిం=హితముల,ప్రద=ఒసఁగువాఁడా, వైరి=శత్రువుల, విగ్రహా=పొందినను, ముకుందా=పోగొట్టువాఁడా, అధిపా=ఓప్రభూ, మిత్=మృత్యుదేవతను, రవింధా=ఆజ్ఞాపింపుము.

తా. ఓ కృష్ణా! నిన్ను భక్తియుక్తులై గొల్చువారి హితాభిలాషివై, మృత్యువును దూరమొనరింతువు. అనఁగా దీర్ఘాయుష్మంతులుగాఁ జేయుదువు.

నీకీ మహార్థప్రతిపాదకమైన పద్యము రుచింపక పోయెనా?

చ. తెలియనివన్ని తప్పులని దిట్టతనాన సభాస్థలంబునన్
బలుకగరాదురోరి, పలుగాఁకిపిశాచపుపాడగట్ట నీ
పలికిననోట దుమ్ముపడ! భావ్యమెఱుంగక పెద్దలైనవా
రల నిరసింతురా! వినుమురా! నరసా విరసా! తుసా! భుసా.

చ. ఒకనికవిత్వమందెనయు నొప్పులుతప్పులు; నాకవిత్వమం
దొకనికితప్పు! బట్టపనియుండదు! కాదనితప్పుబట్టినన్
మొగమటుక్రిందుగాదిగిచి మొక్కలువాసిన యుంపకత్తితో
సిక మొదలంటఁగోతు మఱిచెప్పినగొట్టుదు మోముదన్నుదున్.

నరసరాజు సిగ్గుపడి, మాఱుమాటాడకుండ వెడలిపోయెను. కొలఁదిదినములు గతించినపిదప రాయలు తన తనూజయగు తిరుమ

లాంబతోఁ జదరంగ మాడుచుండగా, బంటు రెం డేనుఁగులమధ్య నిఱుకుకొంటఁజూచిఁ తిరుమలాంబ 'యుద్ధతుల మధ్యమునఁ బేదరుండ దరిమొ, యని బంటులు పైకి ద్రోసెను. రాయలు 'నీకీ పద్యపాద మెటనుండి లభించినదని యడుగఁగాఁ దిరుమలాంబ 'నేనీపద్యమును నాలుగు దీనారములిచ్చి కొంటిని' అని, యిట్లు చదివెను.

'గీ. ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తి చూచి
తరుణి తనుమధ్య మెచటికో తలఁగిపోయె
నుండెనేనియుఁ గనపడకున్న యహహ
యుద్ధతులమధ్యమునఁ బేదకుండ దరమె'

'అయ్యో! ఆపద్యమునకు నాలుగు దీనారములు వెలయా? నూఱుదీనారము లిమ్ము' అనగా తిరుమలాంబ నరసరాజునకుఁ గబురంపి నూఱుదీనారము లొసంగి గౌరవించెను. తాను వ్రాసిన హరిశ్చంద్ర నలోపాఖ్యానమును ద్వ్యర్థికావ్యమును వినవలసినదని రాయల నాతఁడు కోరఁగా, విని హరిశ్చంద్రనలోపాఖ్యాన మనరాదనియు నల హరిశ్చంద్రోపాఖ్యాన మని యనఁదగునని యుఁ జెప్పి, యనేక రీతుల సత్కరించి, వీడ్కొలిపెను.

నరసరాజుని యుపాయమున కందఱు సంతోషభరిత హృదయాంతరులైరి.

---

# కవితాప్రసక్తి

శ్రీకృష్ణదేవరాయలొకనాఁడు సభాస్థలి గూర్చుండి, కవులెల్లరును వినునట్లు రామకృష్ణుని జూచి 'కవివరేణ్యా! పెద్దన కవీంద్ర విరచితమైన మనుచరిత్రమున తిమ్మన్నకవి రచించిన పారిజాతాపహరణమున రామరాజభూషణుని వసుచరిత్రమున నొకేసందర్భమున వ్రాయఁబడునట్లుండు నీ క్రింది పద్యములోని కవితామాధుర్యమును గ్రోలి. నీయభిప్రాయముఁ దెలియఁ జేయవలయును.

'ఉ. పాటునకింతులోర్తురె కృపారహితాత్మక; నీవు దోషని
చ్ఛోట భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొనుమంచుఁ జూపియ
ప్పాటలగంధి వేదననెపంబిడి యేడ్చెఁగలస్వరంబుతో
మీటునవిచ్చు గబ్బిచను మిట్టల నశ్రులు చిందువందగన్.
(మనుచరిత్ర)

'ఉ. ఈసునబుట్టి డెందమున హెచ్చిన కోపదవానలంబులచే
గాసిలియేడ్చెఁ బ్రాణవిభుకట్టెదురన్ లతాంగి పంకజ శ్రీ
సఖమైన మోముపయిఁ జేల చెరంగిడి శాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకల కాకలీధ్వనిన్.' (పారిజా)

శా. ఆజాబిల్లి వెలుంగు వెల్లికలడాయన్ లేక రాకా నిశా
రాజశ్రీ సఖమైన మోముఁ జటాగ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ రాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచిసుధాపూరవంబు తోరంబుగాన్.' (వ.చ)

రామకృష్ణకవి 'మహారాజా! చెప్పుట కేమున్నది? పెద్దన్నగారియేడ్పు అటు యిటూ ఉన్నది. ముక్కుతిమ్మన్నగారి యేడుపు ముద్దుముద్దుగా నున్నది. భట్టుమూర్తిగారు మాత్రము బావురుమని యేడ్చినా'రనెను అందరును గడుపులుబ్బునట్లు నవ్విరి. భట్టుమూర్తికిఁ గోపమువచ్చి, చుర చుర జూడసాగెను. రామకృష్ణకవి 'ఓభట్టుమూర్తీ! నీకవిత్వముఁగూర్చి నేనట్లు విమర్శించినానని కోపగించినావు కాఁబోలు' నని యీక్రిందిపద్యములఁ జదివెను—

'క. చీఁపర పాఁపర తీఁగల
జేఁపలబుట్టల్లినట్లు చెప్పెడి నీయీ
కాఁపుఁ గవిత్వపుఁ గూతలు
బాపనకవివరుని చెవికిఁ బ్రమదం బిడునే?'

శా. ఆద్రిస్నిగ్ధతలంబు బుద్బుదము లుద్యద్దారు భూషావళుల్
క్షుద్రాదుంబర పాకపక్వఫలముల్ శుక్త్యంతరాకాసముల్

రుద్రాక్షాక్షర పంక్తివిభ్రమము లీరూఢిన్నిరూపింప నీ
శూద్రప్రజ్ఞలు విప్రవిత్కవి వచస్ఫూర్తిన్విడంబింపునే?

క. కెంగేల రామకృష్ణుని
బంగరు కడియంబు లుండఁ బాడితుఁ డగునా
జంగులు జల్లులు గల్గిన
సింగారపు టూరకుక్క సింగంబగునా!

---

## 13 అమవసనిశికిన్

శ్రీకృష్ణదేవరాయ లొకనాఁటి మధ్యాహ్నమున నిండు పేరోలగంబుండి.

'క. కలనాటి ధనములక్కఱ
గలనాఁటికి దాచ కమల గర్భుని వశమా'

యని చదివి, మిగత రెండుపాదములనుబూర్తిచేయుమనఁగా నలసాని పెద్దనకవి లేచి,

'నెలనడిమనాఁటి వెన్నెల
యలవడునే నాడుఁబోయ నమవసనిశికిన్'

ఆపద్యము నాకర్ణించి, రామకృష్ణుఁ డిట్లు జదివెను—

క. ఎమితిని సెపితివి కపితము
బ్రమపడి వెఱిపుచ్చకాయ వడిఁదిని సెపితో
ఉమెతకయను దినిసెపితే
యమవసనిశి యన్నమాట నలసని పెదనా!

'అమవస నిశికిన్' యను ప్రయోగము మంచిదికాదను నుద్దేశముతో రామకృష్ణకవి యిట్లాక్షేపణం బొనరించెను. పెద్దన కుత్కృష్టత నాపాదించుచు దనకు నికృష్టత నాపాదించుకొని రామకృష్ణుఁ డిట్లు పద్యముఁ జెప్పెను—

'క. కవి యల్లసాని పెద్దన
కవితిక్కన సోమయాజి గణుతింపగాఁ
గవి నేను రామకృష్ణుఁడ
గవియను నామంబు నీటికాకికి లేదే'

---

## 14 ఆనందభట్టు

రాయల యాస్థానమున కొకనాఁడు తెల్గుకవిత్వమునందుప్రజ్ఞ గల యానందభట్టు అనుకవివచ్చి తన్నుగూర్చి చెప్పుకొనెను. రాయలా కవిత్వము వినవొల్లక, యేదో కొంతధనము బహూకృతిగానిచ్చి వేయ దలంచెను. ఆనందభట్టీ పద్యమును జదివెను.

'ఉ. బూతుకవిత్వవైఖరులపోడిమి జూడక పొమ్మనంగ నీ
కేతగుగాక, యిట్టులను తెవ్వరు సెప్పుదురో నృపోత్తమా
చాతురితోఁ దెనాలి కవిచంద్రుఁ డితఁడు రామకృష్ణుఁడీ
రీతిని యూరకుండిన విరించినినైనఁ జయింపఁ జాలనే?

రామకృష్ణుఁ డంతవరకు రాయలేమనుకొనునో యని మాటాడక యూరకుండెను. ఇఁక సహింపలేక నతఁడు లేచి 'చూతుమె లవుఁడా యటంచు సూక్తులు పలికెన్' అను సమస్యనిచ్చి పూర్తి చేయుమనియెను. ఆనందభట్టు ఆ సమస్యను బూర్తి చేయఁజాలక పోయెను రామకృష్ణకవి యిట్లు పూర్తిచేసెను—

'క. ఆతురపడి యెదరించితి
వాతతబలశాలి రాముఁడనె తనయునితో
సీత, రఘురాము సదృశుని
జూతుమె లవుఁడాయటంచు సూక్తులు పలికెన్.'

ఆనందభట్టు ప్రమోదమంది యిట్లనెను—

ఉ. అర్ణవవేష్టితాఖిల మహామహీ మండలమందు బూతునన్
బూర్ణుఁడు రామకృష్ణకవిఁబోలు కవీశ్వరుఁ డొంటుగల్గునే
నిర్ణయమొంచిచేయు మహనీయగుణాఢ్యుడు బూతుమంచిగా
దుర్ణయుఁడైనచో దివిరిభూ ర్తతమంచిని బూతుచేసెమన్,

---

## 15 పెద్దన కవిత్వము నాక్షేపించుట.

విద్వత్కవు లెల్లరును గూర్చుండి యుండగా రామకృష్ణుఁడు నిలువబడి రాయలు నుద్దేశించి, 'మహారాజా! నాతో భక్తిరసాత్మకములగు బద్యముల నాశువుగా నెవరును చెప్పలేరని ఘంటాపదముగా జెప్పగల' ననెను— రాయలు రామకృష్ణకవీ! భక్తిరసోజ్వలములగు పద్యములఁ జెప్పుము. అప్పుడు నీకంటె యుత్తమముగ నెవరైన నట్టి కవిత్వము జెప్పగలవారుందురో, ఉండరో నిర్ధారణ చేయవచ్చును. రామకృష్ణుఁ డిట్లు చదివెను—

" ఆ. వె. లచ్చిమగఁడ! నీకు లక్షనమస్కృతుల్
సీతమగఁడ! నీకు సేవఁజేతు
సత్యభామమగఁడ సన్నుతించెద నిన్ను
మిత్రవిందమగఁడ మేలొంగు
లక్షణకు మగండ లాలింపరా నన్ను
నీలమగఁడ నాకు నీవె దిక్కు
జాంబవతికి మగఁడ జాలంబుసేయక
మెల్లిమగఁడ నన్ను నేలికొనర!"

రాయలు "ఓహో! మిక్కిలి భక్తిరసాంచితమైయున్నది" యని నాక్షేపణపూర్వకముగాఁ బలుకఁగా రామకృష్ణుఁడు "మహారాజా! తాము నన్ను హేళనఁ జేయనక్కఱలేదు, లోకములో బురుషునకు

నతికంటెఁ బ్రియతమంబగునట్టి దేదియును లేదు. మన పెద్దన కవిశేఖ రుఁడు తమ్మెట్లు వర్ణించెనో మఱచిపోయినారా?

" శ్రీ వేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ! చిన్నమదేవీ
జీవితనాయక! కవితా
ప్రావీణ్యఫణీశ! కృష్ణరాయమహీశా!

చిన్నమదేవీ జీవితనాయక, యని పెద్దనగా రనినపుడు తాము నితాంతసంతోషతరంగిత హృదంతములు కాఁగా లచ్చిమగఁడ యని నపుడు శ్రీమన్నారాయణుఁ డుప్పొంగ, నల్లిమగఁడని పిలుచుకొన్న పుడు నేను బ్రహ్మానందము నొందియుండఁగా మిత్రవింద మగఁడ యన్నపుడు శ్రీకృష్ణుఁ డెట్టి యానందము నొందియుండునో శ్రీవారే యూహింతురుగాక!" యనెను. అందఱు నాతని చమత్కారమున కబ్బురమందిరి.

---

## 16 ముక్కు తిమ్మన్న.

రాయ లొకనాఁడు రామరాజభూషణునిఁజూచి, 'కవీ! స్త్రీ సౌందర్యమును వర్ణించుచు నొక్కనిపద్యమును జెప్పుమా!' యనెను. భట్టుమూర్తి యీపద్యము జదివెను.

'శా. నానాసూనవితానవాసనల నానందించు సారంగమే
లానన్నొల్లదటంచు గంధఫలి బల్ కాకం దపంబంది యో
షా నాసాకృతిబూని సర్వసుమనస్సౌరభ్యసంవాసమై
పూనెం బ్రేంతుణమాలికా మధుకరీపుంజంబు లిర్వంకలన్.'

రాయలు 'భట్టుమూర్తీ! నీకవితామాధురి యత్యంతమధుర ముగ నున్నది. నీకు వేయి దీనారములు బహుమానముగ నిచ్చితిని' అని వేయి దీనారముల నిచ్చెను.

రామకృష్ణకవి లేచి 'మహారాజా! మీరు సకలవిద్యావిశారదులు రాజ్యపరిపాలనా ధురంధరులు కావుననే పద్యమునకు సరియైన వెల నిర్ణయించినారు. ఈపద్యమును భట్టుమూర్తి వ్రాయలేదు. వేయి దీనారములకు మన తిమ్మనకవిగడ గొనెను. మీరు వేయికిబైన నేమైన నిచ్చినగదా మన భట్టుమూర్తికి లాభము?'' అనెను. భట్టుమూర్తి సిగ్గుపడెను.

మఱొకనాడుతిమ్మనకవియింటివద్దనందఱును గూర్చుండికవితాగోష్ఠి గావించుచుండగా నామార్గమున బోవుచున్న భట్టుమూర్తి వారందఱును వినునట్లు తన శిష్యునుద్దేశించి—

క. వాకిట కావలి తిమ్మన
వాకిట కవికోటి మాధవా కిటకోటుల్.'

యని, తిమ్మన వాకిటగూర్చుండిన కవులసమూహము వరాహముల సమూహమును బోలియున్నదను నర్థము వచ్చునట్లు చదివెను. రామకృష్ణుడా దారినిబోవుచు నది విని—

'క. ప్రాకృత సంస్కృత ఘూర్జర
మూకీకృతకుకవితుంగ ముస్తాతతికిన్
వాకిట కావలి తిమ్మన
వాకిటి కవికోటిమాధవా! కిటకోటుల్.'

ప్రాకృత సంస్కృత, ఘూర్జరభాషలమిశ్రమము చేసి, కవనము చెప్పునట్టి కుకవులనుతుంగముస్తలపాలిటికి దిమ్మనవాకిటనున్న కవులందరును వరాహములవంటివారేయను భావము వచ్చునట్లు చదువగా భట్టుమూర్తి సిగ్గుపడెను.

మఱిరెండు రోజులు గడిచినపిదప, ముక్కుతిమ్మనయొకనాడు తనయింటి చావడిలో గూర్చుండి ఊయెలలో నుల్లాసముగ నూగుచుండగా రామకృష్ణుడేగి 'మామా! ఊతునా! యనెను. ఊయల

నూపును కాఁబోలునని భావించి, తిమ్మన ఊఁ యనెను. వెంటనే వికటకవి తిమ్మనపై నుమిసెను అగ్రహావేశమునొంది 'ఓరి నీకేమి పోగాలమురా? నిన్నుమియమంటినా? యని తిమ్మన గర్జింప, 'అవును మామా! ఊతునా? యని నిన్నడిగియే గదా నేనుమిసినాను, అని, రామకృష్ణుడు ప్రత్యుత్తరమిచ్చెను. కోపమాపుకొనజాలక తిమ్మనకవి యూయలపై నుండియే రామకృష్ణుని మొగముపై శక్తికొలది తన్నెను. ఆతాపునకు రామకృష్ణుని దంతమొకటి యూడిపోగా, నాతఁడు యింటికి పోయి దుప్పికొమ్ము నరుగదీసి పన్నుగా నమర్చుకొనెను ఆసంగతి రాయరాజభూషణుడు తెలిసికొనెను నాటి మధ్యాహ్నము కొలువుకూటమున రాయలు 'రవిగాననిచో గవి గాంచునేకదా!' యనుసమస్యను పూర్తి చేయుమనెను. భట్టుమూర్తి యిట్లు పూర్తి చేసెను.

ఉ. "ఆరవి వీరభద్రచరణాహతినుల్లిన బోసినోటికిన్
నేరడు రామలింగకవి నేరిచెఁబో మన ముక్కుతిమ్మన
క్రూరపదాహతిం దెగిన కొక్కెఱపంటికి దుప్పికొమ్ము ప
ల్గా రచియించెనౌర! రవిగాననిచో కవిగాంచునేకదా!"

రాయలాపద్యభావమును గూర్చి యాలోచనాధీనుఁడై యుండగా భట్టుమూర్తి జరిగినదంతయుఁజెప్పి రాయల కాహ్లాదము గలిగించెను.

---

## 17 కవి గండపెండేరము

కృష్ణరాయ లొకనాడు బంగరుపళ్ళెరమున గవిగండపెండేరమును దీసికొనివచ్చి, గీర్వాణాంధ్రములందున మోఘముగా కవిత్వము జెప్పువారికి గవిగండపెండేర మీయఁబడునని చెప్పగా కవులందఱు నాలోచనాధీనులై యుండగా, రాయలు మఱల నిట్లనెను—

ఉ. "ముద్దుగ గండపెండియరమున్ గొనుఁడంచు బహూకరింపఁగా
నొద్దిక నాకొసంగుమని యొక్కరుఁ గోరఁగ లేరు లేరొకో

అని యూరకుండఁగా పెద్దనకవి లేచి—

పెద్దనఁబోలు పండితులు పృథ్విని లేరని నీవెఱుంగవే
పెద్దన కీదలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా

అని యీక్రిందిమాలిక నాశువుగా జెప్పెను—

ఉ. "పూతమెఱుంగులుం బసరుపూప బెడంగును జూపునట్టివా
కైతలు? జగ్గునిగ్గునెనగావలె గమ్మన గమ్మనన్వలెన్
రాతిరియున్ పవల్ మరపురానిహొయల్ చెలియారదంపుని
ద్దాతెఱతీపులో యనఁగ దారసిలన్వలె లోఁదలంచినన్
బాతిగ బైకొనన్ వలెను బైదలికుతుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ సొగసుగుల్కులు గావలె నాలకించినన్
జేతికొలందిఁగాఁగిటను జేర్చినకన్నియ చిన్నిపొన్నిమే
లూన్తల చన్నుదోయివలె ముచ్చటగావలెఁ బట్టిజూచినన్
దాతొడనున్న చిన్నుల మిఠారపుముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱదొండపంటివలె నాచవిగావలెఁ బంటనూదినన్
గాతెలఁదమ్మిచూలిదొరకైనఁ బసుపుంజవరాలి సిబ్బెపు
న్మెతెలి యబ్బురంపుజిగి నిబ్బరపుబ్బ గబ్బిగుబ్బపొం
బూఁతలపూనె కాయ సరిపోడిమి కిన్నెర మెట్లబంతిసం
గాతి పసన్నబంతి బయకాడపుఁ గన్నడగౌళపంతుకా
సాతతతానసంపసన్ దివుటాడెడు గోటమీటుబల్
మ్రోతలనుంబలెన్ హరవుమొల్లముఁగావలె నచ్చతెన్గు లీ
రీతిగ సంస్కృతంబుపచరించెడు పట్టున భారతీవధూ
టీ తపనీయగర్భవికటీ భవదానవసర్వసాహితీ
ఖ్యాతిక నాటకప్రకరభారతసమ్మత ప్రభా
పాతసుధాప్రపూర బహుభంగఘుమంఘుమఘుంఘుమార్భటీ

జాతకతాళయుగ్మలయసంగతిచుంచు విపంచికామృదం
గాతతతేహితత్తహితహో ధితధంధనుధానుదింధిమి
వ్రాతనయానుకూలపద వారిరుహాంద్వహాహారికింకిణి
సూతినఘల్లు లాచరణనూపురఝూళఝుళీమరంద సం
ఘూత వియద్దునీ చక చకద్వికచోత్పల సారసంగ్రహా
యతకుమార గంధవహహారిసుగంధ విలాసయుక్తమై
చేతముచల్లఁజేయవలె జల్లన జల్లవలెన్ మనోహర
ద్యోతక గోస్తనీ ఫలమధుద్రవగోమృతపాయస ప్రసా
రాతిరసప్రసారరుచిర ప్రవదంబుగ సారెసారెకున్.

రాయలంతట నానందభరితాత్ముండై కవికి గండపెండేరము నిచ్చి బహూకరించెనట. ఆగండపెండేరియముం ధరియించి, పెద్దనకవి గర్వమును బ్రకటించుచు నొకనాఁడు సభలో నందఱును వినునట్లు శిష్యుల నుద్దేశించి యిట్లు పద్యములో సగము భాగమును జదివెను—

‘‘చ. వదలక మ్రోయు నాంధ్రకవి వామపదంబున హేమనూపురం
బుదితమరాళకంఠనినదోద్ధతి నేమనిపల్కు పల్కరా—’’

రామకృష్ణుఁడు మిగతభాగము నిట్లు పూరించెను—

చ. ‘వదలక మ్రోయు నాంధ్రకవివామపదంబున హేమనూపురం
బుదితమరాళకంఠనినదోద్ధతి నేమనిపల్కు పల్కరా
గుదియలకాలినుండదగు కోమలకంధరభాగ్యరేఖ నీ
నుదుటను లేదులేదనుచు నూఱుతెఱంగుల నొక్కిపల్కరా!’

పెద్దనకవి సిగ్గునొంది యానాటినుండి యట్లనుట మానివైచెను.

---

## 18 రామకృష్ణుఁడు-గూనిచాకలి.

కృష్ణరాయలొకప్పు డతిజరుగురుగా శత్రురాజులపై దండెత్తుటనుగూర్చి మంత్రివర్గముతో సహాస్యాలోచనం బొనరించు

చున్నంతట రామకృష్ణుఁడేగి రాయలతో నేదియో పరిహాసమాడెను. రాయలుకోపపరీతచిత్తుఁడై భటులబిలిచి 'సమయాసమయము లెఱుగక పరియాచకములాడు రామకృష్ణకవిని కంఠముదాఁక గోయిత్రవ్వించి, యందు కంఠమువఱకుఁ బాతిపెట్టించి, కుంజరములచే, ద్రొక్కింపుడనెను. రాయలట్లు కఠినముగా నాజ్ఞాపించుటచే భటులు చేయునది లేక, రామకృష్ణకవి నూరివెలుపలకుఁ గొనిపోయి, గోయిత్రవ్వి పాతిపెట్టి ఏనుగును దెచ్చుటకై యంతఃపురము కడ కేగిరి.

ఆసమయమున నొక కూనిచాకలి యామార్గమునఁ బోవుట తటస్థించెను. బట్టలను రేవునుండి యింటికిఁ గొంపోవుచు నతఁడు రామకృష్ణునిఁ జూచి 'బాబూ! ఇది యేమి? త మ్మెవరిట్లు కంఠము వఱకుఁ బూడ్చినారు?' అని యడుగ, నాతఁడు 'ఓరీ చాకలీ! నాకుఁ జిరకాలమునుండి గూనియున్నది ఆ కూనిపోవుటకిట్లు చేసితినని' అనెను.

'ఆహా! ఎంత యదృష్టమండీ! బాబూ! తమ గూని బోయి నదా?'

నన్ను బైకిదీసినచో దెలియునుగాని, గోతిలోనుండి నేనెట్లు చెప్పగలను? నన్ను బైకి దీసినచో దెలియునుగదా!'

బాబూ! మిమ్ము పైకిఁ దీసెదను గాని మీకుఁ బోయినచో నాగూని కూడ పోవుటకు తమరు సాయము చేయవలయును' అని యాచాకలి గోతిలోని మట్టినిఁ దీసి, రామకృష్ణుఁ డీవలికి రాగానే 'బలే! బలే! మీకూనిపోయినది' అని తానాగోతిలో దిగెను. రామకృష్ణుఁడు మఱల మన్నుఁబూడ్చి వెడలిపోయెను. కొంతసేపైనపిదప రాజభటులు ఏనుగును గొనివచ్చిరి. చాకలి జరుగనున్నది గ్రహించి 'బాబూ! నేను రాజుగారి చాకలి' నని గట్టిగా ఏడ్వసాగెను. రామకృష్ణుఁడు చేసిన మోసమును గ్రహించి భటులు చాకలిని విడిచిరి. రాయలు రామకృష్ణుని జూచి 'నిన్ను జంపుమని గదా నేను భటుల

కానతిచ్చితిని. నీవెట్లు బ్రతికివచ్చితివి?' అని ప్రశ్నింపగా, రామకృష్ణుడు జరిగినదంతయు జెప్పెను. ఆతని యుక్తికి రాయ లపరిమితాహ్లాదము నొందెను.

---

## 19 విష్ణుచిత్తీయ విమర్శన

రాయలు సకల సామంత మంత్రి పురోహిత బంధుమిత్రపరివార సమాకీర్ణంబైన కొలువుకూటమున గూర్చుండి కవుల నుద్దేశించి యిట్లనెను.

'కవీంద్రులారా! మద్విరచితమైన విష్ణుచిత్తీయమును మీ రందఱును జదివియుంటిరిగదా! ఆగ్రంథమునందలి గుణావగుణముల దెలిపిన వారికి మంచి బహుమానమిత్తు' ననెను. ఏమాటయన్న నేమి కీడుమూడునో యను సందేహించి, యెవ్వరును నేమియుజెప్పక యూరకుండగా, రామకృష్ణుడు లేచి, 'మహారాజా! పెక్కు నసందర్భపువాక్యములతో గూడియున్న యాగ్రంథము విమర్శించుట కేమున్నది? ఇచ్చట నేమియును లేదు—భోజనము జేసి పొమ్ము' అనుటలో నర్థమున్నదా!' యనెను.

'రామకృష్ణకవీ! నాగ్రంథ మసందర్భముగా నున్నదా? నీ మాటలసందర్భముగా నున్నవా! ఎప్పుడును బరియాచకమేనా' యని రాయలడుగ, రామకృష్ణుడు 'మహారాజా! పరియాచకమాడుట కే నెంతవాడను, ఉన్నదున్నట్లుగనే చెప్పితిని. వలయునేని యొకపద్యమును నిదర్శనపూర్వకముగ జదివి చూపింతును.

శా. 'ఆనిష్టానిధిగేహసీమ నడురేయాలించినన్ మోవియున్
తేనాగేంద్ర శయాను పుణ్యకథలుం దివ్యప్రబంధాను సం
ధానధ్యానమునాస్తి శాకబహుతా, నాస్త్యుష్ణతా, నాస్త్యపూ
పో, నాస్త్యోదన సౌష్టవంచ కృపయాభోక్తవ్యమన్నల్కులున్.

తా. కూరలాఱ్టేలేవు. అందున్న కొంచమైనను వేడిగాలేవు. పిండివంటలు, అన్నముకూడ నంత బాగుగాలేదు. దయచేసి భోజనము చేయుడు.

దీనిలో నిజముగా సందర్భమున్నదా? యని రామకృష్ణుడడుగగా రాయ లాశ్చర్యాన్వితస్వాంతుఁడై 'రామకృష్ణా! నీ సాహసమును మెచ్చుకొంటి'సని బహుమాన మొసంగెను.

---

## 20 శీవి

రాయల యాస్థానమున శీవిగా గూర్చుండువారు సామంతరాజులు. ఆ సామంతుల శీవిని జూచినపుడెల్ల రాయలకే నవ్వు వచ్చుచుండును. ఒకనాడు సభలో రాయ లందరనుజూచి, 'శీవి విషయమై ప్రసక్తి వచ్చినప్పుడు మా సామంతులను జెప్పి, మరి యొకరి పేరెత్తవలదు' అనఁగా, రామకృష్ణుడు లేచి 'మహారాజా! కోపింపకుడు. నాశీవిసంగతి మీా రెఱుగరు కావున నట్లు జెప్పుచున్నారు. ఎల్లప్పుడు నేను గురుగుకూర, తిందును. తరిగినకూర యన్న నాకు జాల ప్రీతి ఆగిఁ మన్న పడిచత్తును. మేకమెరువు కుంపటి బెట్టుకొని హాయిగా నులకమఁచంమీాద శీవిగా పండుకొందును' అనెను—

'ఏమిశీవి అదియా॰ నీశీవి' యని రాయలపహసింపగా, రామకృష్ణకవి 'ప్రభువువారు విష్ణుచిత్తీయమున నెట్లు సెలవిచ్చినారో మఱచిపోయినట్లున్నది వినుడు.

'మ. గురుగుంజెంచలి తుమ్మికేఁదగిరి నాకుందింత్రిణీపల్లవో
త్కరముంగూడ ఘొరఁటి నూనియలతో గట్టావికుట్టారిగో
గిరిముల్మెక్కి తమిం బసుల్ప్వలముఁలోఁగ్రేపున్మొయిన్నాకమే
కెరువున్ గుంపటి మంచ మెక్కిఁరి ప్రభుత్వైకాప్తిరెడ్లజ్జడిన్'

ఆమాటలు విని రాయ లెంతనూత్రము గినియక చాల ధనమొసగి సత్కరించెను.

# 21 నల్లకుక్కను ఆవుగ జేయుట

రాయలొకనాటి యుదయమున వపనము జేయించుకొనుటకై మంగలికి గబురుచేసెను. ఆమంగలి వచ్చుటకు గొంచె మాలస్య మయ్యెను. అతఁడువచ్చి చూచుసరికి రాయలు కుర్చీలో గూర్చుండి నిద్రాముద్రితుడై యుండెను. రాయలకు నిద్రాభంగము జేయుట పాడికాదని, మెల్లగా క్షురకర్మ ముగించి వెడలెను. కొంతసేపైన పిదప రాయలు లేచి, తాను నిద్రాబద్ధుడై యుండగనే మంగలి క్షౌరము చేసి వెళ్ళిపోవుటచే వాని చాకచక్యమున కెంతయు సంతో షించి, వానికి కబురంపి, 'నీకేమికావలయు?' నని యడిగెను.

'మహారాజా! నాకు జిరకాలమునుండి బ్రాహ్మణుడ కావలె నని యున్నది. నాకు ధనముగాని, మఱేయుఁగాని యక్కఱలేదు. నాకోరిక నెరవేర్చిన జాలును' అని యా క్షురకుడు పలుక, రాయలు 'అదెంతపనియని?' బ్రాహ్మణుల రావించి, శుభదినము నిశ్చయింప జేసెను.

శుభదినమున ద్విజులామంగలిని తుంగభద్రానదికి దీసుకొని వెళ్ళి, స్నానము జేయించి. మంత్రములు జదువుచుండిరి. రామకృష్ణ కవి యీ వృత్తాంతమును దెలిసికొన్నవాడై మఱికొందఱు బ్రాహ్మ ణుల దనవెంట నిడుకొని, నదీతీరమున వారున్నచోటికే పోయి యొకింత దూరముగా నిలువబడి యొక నల్లకుక్కను మాటి మాటికి నీటిలో ముంచుచు, మంత్రపఠన మొనరింపసాగెను. రాయలు సమీ పించి 'రామకృష్ణకవీ! కుక్క నేడ్పించు చున్నావేమి?' అని ప్రశ్నించెను.

రామకృష్ణుడు 'రాజేంద్రా! ఈ శునకమును ఆవుగా జేయ వలయునని యిచటకు గొనివచ్చి, మంత్రముల జదివించుచున్నా' నని బదులుపలుక, రాయలు 'అమాయకుడా! పావనస్రవంతీజలస్నానము వలన, వేదమంత్రపఠనమువలన కుక్కగోవగునా? ఈవిచిత్ర మెచ్చట

నైనకద్దా? యనెను. వికటకవి 'ప్రభూ! తామనుగ్రహించి, మంత్ర మూలమున మంగలిని బ్రాహ్మణునిగా జేయుటలేదా? అదివిచిత్రము కాదా మంగలి ద్విజుండగుటయే తటస్థించునేని యీ శునకము తప్పక గోవగును సందియము లే'దనెను.

తన యవివేకమును దెలియజేయుటకే రామకృష్ణు డిట్టి పన్నాగము బన్నెనని గ్రహించి, రాయలు మంగలిని పిలిచి 'ఓయీ! నీవు బ్రాహ్మణ్యము నెట్లును బొందజాలవు నీకు వలయునది మరేదియైన గోరుకొనుము' అని చెప్పి, యంతఃపురమునకు బోయెను.

---

## 22 పింగళి సూరన్న

రామకృష్ణకవి రాయలు తదితరులు నాస్థానమున నుండగా యొకనాడు 'భార్య సద్గుణవతియైనచో బురుషునకు బ్రసిద్ధి—మంచి పేరువచ్చునుగదా! యనెను. పింగళిసూరన్న 'ఆహా! ఎంతగొప్పగా సెలవిచ్చినావు? భార్యగుణవతియైయుండి భర్త దుర్మార్గుడైనచో, భర్తకు గీర్తియెట్లు కలుగును? ఇరువురును గూడ సద్గుణశాలురైయున్నచో గీర్తికలుగుట వాస్తవము' అనెను—

'అవును నీవు రాఘవపాండవీయములో వ్రాసికొనినట్లు చెప్పుచుందువు. నీకవిత్వము నేబలపరచుకొనుచుందు'వని రామకృష్ణుడనగా, రాయలు 'దానికిని దీనికిని సంబంధ మేమున్న?'దనెను, రామకృష్ణకవి 'ఆర్యా! ఇదిగో యీతకు వ్రాసిన పద్యము.

సుతుని దౌష్ట్యముచే. బలాత్కారముచే ధృతరాష్ట్రుడుకుమారుని మార్గముసే యనుసరించినను, సతియగు గాంధారి సౌజన్యము వలననే కీర్తికాముడయ్యెను.

'క. సుబల తనయ గుణమహిమన్
ప్రబలి తనకథాంధధర్మ పాలనలీలన్
సొబగొందె వన్నె దేఁగా
విబుధ స్తుతుఁడవ్విభుండు వెలసెన్ ధరణిన్.

తన్నారీతి నాక్షేపణం బొనర్చినందున క్రోధంబునుజెంది, పింగళి సూరన్న యింటికిజనెను. భార్యభోజనమునకు లెమ్మని ప్రతి మాలినను లేవక పింగళి సూరన్న రామకృష్ణుపైగోపముకొలదినొక పద్యము నిట్లు వ్రాయఁబూనెను—

క. 'తెనాలి రామకృష్ణుఁడు
తిన్నాడుర తట్టెడంత—

ఇకమీద నాతనికేమియు స్ఫురింపనందున భోజనము చేసి పిదప వ్రాయదలంచి, స్నానార్థము తుంగభద్రకరిగెను. తనపై గోపగించి వెళ్ళినందున ముక్కోపియగు సూరన్న భోజనము చేసి నాఁడో లేదోయని రామకృష్ణుఁడు సూరన్న గృహమున కరిగి చావ డిలో నున్న తాటియాకుం దిలకించి, తనపైవ్రాసిన యర్థభాగము జదువుకొని, మిగిలిన రెండుపాదములను బూర్తిచేసి వెడలిపోయి, పెద్దనాదికవుల గొసివచ్చెను. ఆసమయమునకు సూరన్న భోజనము చేయుచుండుటచే పెద్దనతాళపత్రముం దిలకించి యందఱు నాలకించు నట్లు చదివెను.

'క. తెనాలి రామకృష్ణుఁడు
తిన్నాడుర తట్టెడంత తియ్యనిబెల్లం
బెన్నఁగ మన పింగళి సూ
రన్నకు నోరంత పేడయై పోయెనురా'

అందఱును నవ్విరి. పెద్దన 'సూరన్న ముక్కోపి'యగుట నిటు వ్రాసినాఁడు అనెను. సూరన్న రామకృష్ణుఁడు వ్రాసినమిగతపాదము లకు గినియక నవ్వి యూరకుండెను.

---

# 23 పురాణ శ్రవణము

రాయ లొకనాడు 'రామకృష్ణకవీ! నెల్లూరు నెఱజాణల నెప్పుడైన జూచితివా?' అని ప్రశ్నించెను. 'చూడకేమి' ప్రభూ! ఒక సారి జూచితిని గాని నాకు సంతృప్తిగలుగునట్లు ఎవతెకైన దగిన ప్రాయశ్చిత్తముం జేయవలయునని చిరకాలమునుండి కోరికగలదు. తమ సెలవైనచో నొకసారి యాసింహపురికరిగి, నాకోరిక దీర్చుకొని వత్తును' అనగా రాయ లంగీకరించెను.

రామకృష్ణుడు నెల్లూరునకుబోయి చిత్రాంగి యను వేశ్య మిక్కిలి పాండిత్యము గలిగినదై, యెటువంటి దిట్టలగు పండితులు వచ్చినను ఓడించుచుండెననివిని, యామెను జూడబోయెను.

రామకృష్ణకవిని నారోవెలంది యర్ఘ్యాసనమిచ్చి, గౌరవించి, 'మీరు పురాణముం జెప్పగలరా? ఎన్నివిధముల బురాణములు చెప్పగలరు?' అని యడుగ నాతడు 'చిత్రాంగీ! నేనష్టాదశపురాణముల నభినయానభివార్ధ తరన్యాసాకాశాలంబన ప్రత్యక్షవిధానములతో జెప్పుదును.' అనగా నామె 'అట్లయినచో నేటిరాత్రి భోజనానంతరము రండు కొంతసేపు కులాసాగా కాలక్షేపము జేయుదము' అనెను.

రాత్రి భోజనానంతరము రామకృష్ణకవి చిత్రాంగియింటికి వెళ్ళెను, ఆమె 'కవిగారూ! రామాయణములోని సుందరకాండము బహు రసవంతమైన ఘట్టము కావున నాఘట్టమును బ్రత్యక్షపురాణముగ జెప్పుడు' అనెను. అటులనేయని రామకృష్ణకవి 'హనుమంతుడు మహేంద్రపర్వతము నారోహించె'నని మంచము నెక్కెను. 'అటనుండి మైనాక శైలముపైకి దుమికె'నని మఱొకమంచముపైకి దుమికెను. 'లంకలో బ్రవేశించి లంకిణి నిట్లుకొట్టె'నని చిత్రాంగిని గొట్టెను. 'పిదప లంక కగ్నిముట్టించె'నని యావెలయాలి చీర లన్నిటిపై

నూనిపోసి యంటించి 'వాయుసూనుడు సముద్రములో మంటల నార్చుకొనె'నని నూతికడకుబోయి స్నానముచేసి, తనయిల్లంతయు నట్లు చిందరవందర చేసినందుల కలోయని యేడ్చుచున్న యావేశ్య వంక చూచి 'దీనినే ప్రత్యక్షపురాణమందురు. తెలిసినదా' అని వెడలిపోయెను. చిత్రాంగి రోదసీకుహరము ప్రతిధ్వనించునట్లు విలపించును దిన్నగా న్యాయాధికారికడకు బోయి ఫిర్యాదు చేసెను. రామకృష్ణకవి వెళ్ళి, న్యాయాధికారికి యదార్థమంతయు విన్నవించెను న్యాయాధికారి 'చిత్రాంగీ! నీవట్లుకోరుట నిజమేయగుచో నాతడట్లు జేయుటలో దప్పేమియునులే'దని మందలించి పంపెను.

రామకృష్ణకవి ! విజయనగరమునకు దిరిగివెడలి, రాయలను సందర్శించినంతనే, రాయలు 'కవిచంద్రమా; నెల్లూరు నెరజాణల సౌందర్యమును వర్ణింపుము' అని యడుగ, రామకృష్ణు డిట్లాశువుగా బద్యమును రచించి, చదివెను—

సీ. మొలక చీకటి జల జల రాల్పగరాదె
నెరులు మించిన వీరి కురులయందు
కెరలించి యమృతంబు గిలకొట్టగారాదె
ముద్దుచూపెడి వీరిమోములందు
పచ్చబంగారు కుప్పలు సేయగారాదె
గబ్బిమీరిన వీరి గుబ్బలందు
పండువెన్నెల తేటc బ్రభవింపగారాదె
నగవు గుల్కెడి వీరి మొగమునందు

గీ. నౌర! కరవాడిచూపుల యాఘుళంబు
బాపురే! భూరికటికటీ భారమహిమ
జాలు మదగజగమనలక్షణముతీర
నేర్పుమించెదరప్పురి వారసతులు.

# 24 భాగవతము

కూచిపూడినుండి రాయలకడ ప్రదర్శించుటకై యొకప్పుడు భాగవతులువెళ్లిరి. రాయ లొకనాడు వారిప్రదర్శనమునకు నిర్ణయించెను. రామకృష్ణుడు వచ్చినచో నేదో యల్లరి నారంభించి కథ సరిగా జరుగనీయడని తలంచి, పహరావారితో 'ఏమైనను సరే రామకృష్ణుని రానీయవలదు' అని చెప్పెను. ఈసంగతి రామకృష్ణకవి తెలిసికొని వ్యస్తచిత్తుడై యెట్లైన భాగవతముంజూచి తీరవలయునని, మారువేషమున నచటికేగెను. కావలియున్న భటులు చర్మవేషధారియైన రామకృష్ణుని కంఠస్వరమునుబట్టి గుర్తించి లోనికి బోనీయరైరి. రామకృష్ణుడెంతబతిమాలినను లాభములేకపోయెను. తుద కాతడొక యుక్తిపన్నెను.

'ఓరీ మిత్రులారా! ఒకమాట చెప్పెదను. శ్రద్ధగా వినుడు. రాయలు నేడందరకు నేదోయొక బహుమానమిచ్చును. ఆబహుమానము నాకక్కరలేదు. మీాయిరువురకు బంచియిచ్చెదను. నన్ను లోనికి పోనిండు'అని రామకృష్ణుడా కావలివారల కాశపెట్టెను. భటులంగీకరించి, రామకృష్ణకవిని లోనికిబోనిచ్చిరి. కృష్ణుని యల్లరి చేష్టలను యశోదతో గోపికలు చెప్పుచుండునట్టి ఘట్టము భాగవతులచే బ్రదర్శింప బడుచుండెను. యశోద కృష్ణునిచీవాట్లు పెట్టుచుండెను. రామకృష్ణుడు మెల్లగా నాభాగవతులనుసమీాపించి కృష్ణపాత్రధారుని కఱ్ఱతో గొట్టగా, నాతడు కుయ్యోయ్యయనియేడ్వసాగెను. ఎవరాయల్లరియని రాయలు ప్రశ్నింప భటులు 'రామకృష్ణకవి' అనిరి.

'ఎందుల కావేషధారిని కొట్టినా'వని రాయలు కవిని నిరోధించి యడుగగా నాతడు 'మహారాజా! యశోద కృష్ణుని మందలించుటయేగాని కొట్టుట బ్రదర్శింపని యీాభాగవతుల భాగవతమెంత

యందముగా నున్నది. అందుచే నిది రక్తికట్టుటకై కృష్ణపాత్రధారిని గొట్టినా నని బదులుపలికెను. రాయలు కుపితుడై పహరా నిచ్చు చున్న భటుల బిలిపించి 'రామకృష్ణుని యిరువదినాలుగు దెబ్బలు కొట్టుడని యాజ్ఞాపించెను రామకృష్ణునిఁ దీసికొని పోవుట కాభటులు ముందుకురాగా మహారాజా! మీరు శిక్షవిధించుట న్యాయమేగాని నేను లోనికి వచ్చినపు డీ యిరువురు భటులతోడను, నాకు రాయల వారు ప్రసాదించు బహుమానము చెరిసగము మీకిచ్చెదనంటిని. అందుచేత నాయిరువది నాల్గు దెబ్బలతో వీరికి పండ్రెండు వారికి పండ్రెడు దెబ్బలు తగులవలయు ననెను. ఆభటులు మొర్రోయని యేడ్వసాగిరి. రామకృష్ణుని యుక్తికిముదమంది రాయలు మన్నించెను.

---

## 25 తిమ్మరుసు

ఉత్తర దేశ దండయాత్ర పూర్తి చేసికొని వచ్చుచు, రాయలు సింహాచలక్షేత్రమును సందర్శన మొనరించెను. సింహాద్రిస్వామి సన్నిధిని రాయలనేక దానములగావించెను. పెద్దనాది కవులందరు గూడ రాయల ననుసరించియుండిరి. తిమ్మరుసు మంత్రికూడ పెక్కు దానముల జేసెను. రాయ లగ్రహార దానము చేయనెంచితినని చెప్పగా రామకృష్ణుడు తన బంధువుఁడగు మంత్రిప్రగడ బుచ్చి వేంకయ కాదానమిప్పించవలసినదని రాయలను కోరెను. రాయ లందులకు సమ్మతింప, తిమ్మరుసు, రామకృష్ణుడు తక్కుంగల కవుల వలె దనయెడ భయభక్తియుక్తుడై మెలంగడను కోపముతో వలదని వారించెను. రామకృష్ణుడు క్రోధమునంది యీపద్యము జదివెను—

ఉ. లొట్టయిదేటిమాట పెనులోభులతో మొగమాటమేల తా
గుట్టకయున్న వృశ్చికము కుమ్మరపువ్వని యందురేక దా
పట్టపురాజుపట్టి సరిపల్లె సరాసరి యీయకున్న నే
దిట్టకమాన నామతము తీవ్రమహోగ్రభయాకరంబుగాఁ.

దిట్టతినా? మహోగ్రహుమతిన్ మకరగ్రహఝర్ఝరీభటా
పట్టపుదట్ట ఫాలఫణిభర్తృబహూకృతపర్జటస్ఫుటా
ఘట్టదట్టనాల కవిఘట్టనిగర్గళ రాజభృత్యకీ
చట్టభధూర్జటీ నయనజర్జరకీలలు రాలగావలెన్
జుట్టరికంబునం బొగడజూచితినా రజితాద్ర్యధిజ్యకీ
పట్టణ మధ్యరంగగతభవ్యనధూవదనానుషంగ సం
హట్ట శిరస్థగాంగఝరహల్లికజాలసుధా తరంగముల్
చుట్టుకొనన్వలెన్ భువనచోద్యముగా భయదంబుగా మతిన్
దిట్టతినా సభాభవన ధీంకృత భీమనృసింహరాడ్య జా
తాట్ట మహాట్టహాస చతురాననసముద్భ్రుకిటీ తటీవటీ
కోట్టణరోమజాల హృంతకుంఠిత కంఠగంభీర నాడనం
ఘట్ట విజృంభమాణగతి గావలె, దీవనపద్యమిచ్చి చే
పట్టితినా మణీకనకభాజన భూషణభాసురాంబరా
దట్ట తురంగిగంధ గజరాజ దమూల ఘనాతపత్రభూ
పట్టణభర్మ్యభటపంక్తి చిరాయు రనామయంబులై
గట్టిగ దోడుతో వెలయగావలె నెక్కువకేవి జూడుడీ
యట్టిటు మంపమేలమును నందఱకుంబలె జుల్కజూచియే
పట్టుననైన గౌరవము పల్కకుడీ పయిపెచ్చు నందునన్
గొట్టదు దుష్కవిద్విరదకోటుల వింశముఖోద్భటాకృతిన్
బెట్టుదుదండమా ల్సుకవిబృందముకే నతిభక్తిసారెకున్
గట్టిది ముల్లెలేబదియు గాగలనూటపదాఱులెయ్యెడన్
రట్టడి రామకృష్ణకవిరాయుని మార్గమెఱుంగ బల్కితిన్'

ఈ పద్యమువిని, తిమ్మరుసుమంత్రి భీతచేతస్కుడయి రాయ లచే బుచ్చివెంకునకు గోనేడగ్రహారమును దానముగ నిప్పించెను. సింహాచలక్షేత్రమున నాలయస్తంభముపై రామకృష్ణుడీశ్లోకమును శిలాశాసనరూపమున వెలయించెను.

శ్లో. శాకాబ్దే బహుధాన్యనామనసభోనేత్రాబ్ధి చంద్రాన్వితే
కార్తీక్యాం శశివాసరే శుభతిథే సింహాచలస్వామినే
హారంకర్ణ విభూషణేన కటకే శ్రీకృష్ణరాయాధిపా
మాత్యారాచయ సాళ్వతిమ్మ నృపతిః ప్రాదాద్విజన్మాగ్రణీః

నాటినుండియు, తిమ్మరుసుమంత్రి రామకృష్ణునియెడ నాద రాభిమానములు గలిగి మెలంగుచుండెను.

---

## 26 తిలకాష్ఠ మహిష బంధనము

రాయల యాస్థానమున కొకనాడు రామశాస్త్రి యను పండితుడు వచ్చి 'రాజా! నేను తర్క వ్యాకరణ పండితుడను. తమ యాస్థానమున విద్వాంసులను గెలుచుట కేతెంచినాను' అనగా రామకృష్ణకవి 'అయ్యా! శాస్త్రిగారూ! తమరు కవిత్వముకూడ చెప్పగలరా?' యని ప్రశ్నించెను.

'వెధవకవిత్వమే చెప్పలేనా? అదికూడ గొప్పయేనా?' అని యా శాస్త్రి పలికెను.

'అయితే మీరు నిస్సంశయముగా వెధవకవిత్వము జెప్పగల రని తలంతును—'

'వెధవకవిత్వము—పునిస్త్రీకవిత్వము నని రెండురకముల కవిత్వము లున్నవా?'

'మీరే యన్నారుకదా, వెధవకవిత్వమే చెప్పలేనా యని అందుచేత మీకెందు పాండిత్యమున్నదో యెఱుంగవచ్చునా?'

'తర్క వ్యాకరణములందు'—

అయితే ఒకమాట—త్రియంబక, అనుపదమునకున్న యధికారసూత్రమును దెలుపుడు—'

త్రి+అంబకః—ఇది ద్విగుసమాసము.

'ఓహో! ఎంతయందముగా నున్నది. తమరు వ్యాకరణము నింతయందముగా వెలిగించినవారని తెలుపలేదు.'

ఆనాటికి గొలువు చాలింపబడెను. మఱునాడు మఱలవాదము ప్రారంభమయ్యెను. రామకృష్ణకవి యొక పెద్దకట్టపై నొకవస్త్రము గప్పియుంచెను.

'ఆ గ్రంథమేదియో యెఱుంగవచ్చునా!' అని రామశాస్త్రి యడుగ, రామకృష్ణుడు 'ఇదితిలకాష్ఠమహిషబంధనమను గ్రంథము. మనవాదమునకు బనికివచ్చునని యీగ్రంథమును గొనివచ్చినా' ననెను.

రామశాస్త్రి 'తిలకాష్ఠ మహిషబంధనమను గ్రంథమున్నదని యెన్నడును వినియుండలేదు.' అందుచే నాతడు కంగారుపడి తనకా నాడు ఓటమి తప్పదని గ్రహించి, 'మహారాజా! బసలో నావ్యాకరణ గ్రంథముల మఱచిపోతిని. త్వరితముగా గొనివత్తును. సెలవిండు' అని వెడలిపోయి, యా నగరమునుండి వెడలిపోయెను—

రాయలు 'రామకృష్ణకవీ! ఆ రామశాస్త్రి వచ్చులోపున నా తిలకాష్ఠ మహిషబంధనమను గ్రంథమును జదువుము' అనెను.

రామకృష్ణుడు నవ్వుచు 'మహాప్రభూ! తిలకాష్ఠ మహిష బంధనమనగా నేదో గ్రంథమనుకొంటిరిగాబోలును' అనివస్త్రమును దొలగించెను—నువ్వులకంప, కన్నెత్రాడు నుండెను. 'మహారాజా! తిలకాష్ఠ మనగా నువ్వులకంప, మహిషబంధన మనగా యెద్దును గట్టు కన్నెత్రాడు' అనెను.

'నిజముగా నాపేరువిని యాశాస్త్రి కంగారుపడి పాఱిపోయి నాడు' అని పెద్దనకవి పలుకగా నందఱును నవ్విరి.

---

# 27 కుమ్మర మొల్ల

రాయలు విద్యానగర సామ్రాజ్యమును బరిపాలించుచున్న కాలమున నాతుకూరి మొల్లయను కుమ్మరస్త్రీ యుండెను. భర్త యామె బాల్యముననే మృతినొందినను, మారునునుమున కిష్టము లేనిదై నాంధ్రమున బరిశ్రమ మొనరించి, కవిత్వముచెప్పుట నేర్చెను. శ్రీ శైలశైవారాధ్యులవారికడ శుశ్రూష చేయుచు జాలకాలము గడపెను. శైవారాధ్యులవారికి సంతానము లేకుండుటచే దమ యవసానదశలో దమకున్న ధనమంతయు నిచ్చివైచిరి. ఆధనముతో నామె యుదరపోషణ మొనరించుకొనుచు, దన కవితాశక్తినంతయు విని యోగించి, రామాయణము వ్రాసెను.

ఆ రామాయణము నామె రాయల కంకిత మీయదలంచి, యాస్థానమున కరిగి చదువుట కనుమతి నీయగోరెదను. రాయలు వల్లెయనగా, రామకృష్ణకవి 'ఆడుదికూడ—నందులో గుమ్మరస్త్రీ కుండలు చేసికొనుటకు మారు రామాయణమే రచించుటయా' యని నిరసనభావముతో 'రాజేంద్రా! నేనొక పద్యము వ్రాసితిని. ముందు నాపద్యము నాకర్ణించి, తరువాత నాగ్రంథమును జిత్తగించుడు' అని ముందుగా 'వాల్మీకి దన బూతుపద్యము జదివెను. మొల్ల సిగ్గుపడి, యచటినుండి వెడలిపోయి తన గ్రంథమును శ్రీరామచంద్రునకే యంకిత మొసంగెను. ఆవృత్తాంతము నాలకించి, రాయ లామెను బిలిపించి మొల్లా! నీవు బహుజనశ్లాఘనీయమగు పనిజేసితివి. రామచంద్రున కంకితమిచ్చి, 'ధన్యవైతి'వని కొంతధనము నిచ్చి నీవు మా నగరమున నివసింపుము. ప్రతివత్సరమును నీయుదరపోషణకు వలయు ధనము మేమిచ్చుచుందు' మనెను.

ఆమె నిగర్వి. తనకు నౌకరులుండవలసిన బనిలేదని, స్వాయముగా నంగడికిబోయి వలయు సంబారముల దానే కొనితెచ్చుకొను

చుండును. ఒకనా డామె యంగడికిబోయి కోడిపెట్ట నొకదానిం గొని కుక్కగొలుసు మఱొకకేలంబూని వచ్చుచుండెను. రామకృష్ణు డామార్గముననే పోవుచు తన కెదురైన మొల్లనుజూచి, పరిహాసపూర్వకముగా 'మొల్లా! యీపాయిచ్చెద కుక్కనిచ్చెదవా, పెట్ట నిచ్చెదవా? యనెను. ఆ వ్యంగ్య సంభాషణకు గుపితయయ్యు పరమ శాంతస్వభావి యగు మొల్ల 'రామకృష్ణకవీ! నీవేమి యీయఁబూనినను నీకు నేనవ్వనుకదా!' యనెను. రామకృష్ణుడు సిగ్గుపడి యారోజు నుండియు నామెయందు మాతృభావము గల్గియుండెను.

---

## 28 అయిదు వేలు

రాయలు కవులందరకు మానవేతన మిచ్చుచుండెను. రామకృష్ణకవికూడ యదేవిధమున మానవేతనము నొందుచు బిల్లలు కలవా డగుటచే నా ధనముతో గడుపుకొనజాలక యిబ్బంది పడుచుండెను. ఎట్లయిన రాయలునుండి ధనము స్వీకరింపవలయు నని రామకృష్ణు డుపాయముల నూహింపసాగెను. తుదకొక చక్కని యుక్తి నాలోచించి, భార్యాపుత్రులకుజెప్పి, రాయలకడ కరిగెను. రాయలు సంతోషాన్విత స్వాంతుడై యున్నతఱి రామకృష్ణుడు సమీపించి, మహారాజా! నాగుండెలు నిరంతరము నగ్నిహోత్రముచే దహింపబడినట్టుమండిపోవుచున్నవి. ఇక నేనెంతో కాలము బ్రతుకను. నాకు జాలమంది పిల్లలు కలరు. నేను మరణించినచో వారిపాట్లు వర్ణించుట కా యాదిశేషునికైన నలవికాదు, జ్యోతిష్కులుకూడ నిక నెంతో కాలము బ్రతుకవనిరి. నాకు జాల బెంగగానున్నదనెను. రాయలు దయార్ద్రహృదయుడు. రామకృష్ణుని వాక్యములకు జాలి నొంది 'కవిచంద్రమా! ధనార్జనాసక్తులగు జ్యోతిష్కులమాట పాటింపరాదు. నీవట్టి బెంగలతో క్రుంగిపోకుము. 'మనోవ్యాధికి మందు లేదుకదా? యను సూక్తి నెఱుంగవే? ఒకవేళ నీవు మృతి నొందుటయే తటస్థించినచో నీభార్య కయిదువేల దీనారముల నంపె

దను, చాలునా?' యనెను. రామకృష్ణుడు మిక్కిలి సంతసించి వెడలి పోయెను.

వారమురోజులు కడచెను. రామకృష్ణుడు తన బంధుగుల జూచుటకయి కలుబరిగె నగరమునకు బోయెను. వెళ్ళిన నాలుగు రోజులకు ఆ బంధువునికడనుండి పెద్దన్న, పింగళిసూరన్న మున్నగు కవుల యింటికి రామకృష్ణుడు జ్వరపీడితుడై మరణించెనని లేఖలు వచ్చెను. నగరమంతయు క్షణములో నావార్త వ్యాపించెను. అట్టి హాస్యగాడు దొరకడని వర్తకులనిరి. 'మంచిస్నేహితుని,కవిని, గోల్పోయితి' నని రాయలు కన్నీరువిడిచి వెంటనే అయిదువేల దీనారములను రామకృష్ణుని భార్యకంపెను. పదునైదు దినములు గడచెను. రామకృష్ణకవి కలుబరిగె నగరమునుండి తిరిగివచ్చి, యాస్థానమునకు జనెను. రాయలు, తక్కుంగల వారు 'ఇదియేమిచిత్రము? నీవు మృతినొందితివని లేఖవచ్చెగదా?' యనిరి. రామకృష్ణుడు 'అవును. నేను మృతినొందినమాట వాస్తవమే కాని యమధర్మరాజు 'ఇది యేమి! వీనికింకను గొంత కాలము గడువున్నదని 'ఓరీ! మీ రాయల వారు నీభార్యకయిదువేల దీనారములంపినారు. ఆ ధనమును సుఖముగా ననుభవించిర 'మ్మనగా దిగిగివచ్చితిని' అనెను.

'ఆహా! అటులనా! ఈఅయిదువేల దీనారముల బొందుట కెత్తిన గొప్పయెత్తు'అని రాయలు మందహాస మొనరించెను.

---

## 29 మామిడిపండ్లు

రాయలతల్లి నాగాంబ మరణించుటకు బూర్వము రాయలను బిలిచి 'నాయనా! నాకు మామిడిపండ్లు తినవలయునని యున్నది.' అనెను. వెనువెంటనే రాయలు ఎంతఖరీదైనను సరే ఎచ్చటనున్నను సరే ఎన్నిదొరికిన నన్ని మామిడిపండ్లను గొనిరండు' అని భటులను నల్దెసలకంపెను. తిరిగి తిరిగి భటులు ఫలముల గొనివచ్చునంతలో నాగాంబ యసువుల బాసెను. తనతల్లి యవసానదశలో గోరినకోరిక

తీర్చజాలక పోయితిగదా' యని రాయలు పరిమితిలేని విచారము నొందెను.

విషణ్ణవదనులై యున్న రాయలనుగాంచి, తాతాచార్యులవా రిట్లనిరి—'ప్రభూ! మీరు గతించినబాపునకై వగచిన ప్రయోజన మేమియును లేదు. బంగారు మామిడిపండ్లను జేయించి, బ్రాహ్మణులకు దానమిచ్చినయెడల నామె కోరిక యుదీఱును. మీ మనస్తాపముం దీఱును' అనెను. ఆమాటలు నచ్చగా రాయలట్లేయని బంగారు మామిడిపండ్లను జేయించెను. లెక్కలేనంతమందిభూసురులు గుంపులు గుంపులుగా రాసాగిరి. ప్రతిసంవత్సరమును గొన్నివేల దీనారము లిందుకు వ్యయమైపోవుచుండుటచే పెద్దనాది కవులు భీతచేతస్కులై రామకృష్ణకవిని హెచ్చరించిరి.

సరేయని రామకృష్ణుడు దేశదేశములనుండి దురాశాపరులై వచ్చిన బ్రాహ్మణులున్న భవనముకడకరిగి, 'బ్రాహ్మణోత్తములారా! మీకందఱకును మామిడిపండ్లనిచ్చుటకు ముందు రాయలవా రొక పద్ధతిని దెలియజేయమనినారు. ఒక్కొక్కపండు కావలసినవారు ఒక్కొక్కవాత పొందవలయును. రెండుపండ్లు కావలసినవారు రెండువాతలను బొందవలయు'నని పలుక, నా బ్రాహ్మణులు విశ్వసించి, ఒక్కొక్కవాతను బొందిరి. కొంతమంది రెండేసి వాతలను బొందిరి. తరువాత రాయలువచ్చి బ్రాహ్మణులందఱకును మామిడి పండ్లీయఁబోయెను. రెండువాతలు పొందిన ద్విజుఁడొకఁడు 'అయ్యా! నేను రెండువాతలు వేయించుకొన్నాను. నాకు రెండు పండ్లీయవలెను' అనెను.

'వాతలేమిటి' అని రాయలు నాశ్చర్యముగాఁ బలుక నా బ్రాహ్మణులందఱును దమవాతలఁ జూపించిరి. రాయలు ముక్కుపై వ్రేలిడుకొని నిర్విణ్ణుఁడయ్యెను. రామకృష్ణునకు వెంటనే కబురంపి, 'నీవు మతిపోయినదా? నేను సంతోషముగా సువర్ణచూతఫలము

లీయఁబోవ నీవందరకును వాతలిడు టేమి?' అనగా రామకృష్ణుఁడు 'మహారాజా! నేను చెప్పునది సావధానచిత్తులరై యాలకింపుడు. మాతల్లి వాతరోగపీడితయై చనిపోవుచు వాతలు, వాతలు అని కలవరించుచు మృతినొందెను. ఆమె ఆత్మసంతృప్తికై యింతమంది బ్రాహ్మణులు మఱల నొకచోట కలియరని యెంచి, యాఫలము నాకు దక్కుటకై వాతల బెట్టించితిని' అని వాక్రుచ్చెను.

తాతాచార్యుల సలహా ననుసరించి, తానొనరింపఁ బూనిన దకృత్యమని బోధింపఁజేయుటకై రామకృష్ణుడు పన్నిన పన్నుగడ యని గ్రహించి రాయలు లా దానమును జేయుటమానెను.

---

## 30 చిన్నాదేవి

రాయలు భార్యలందఱిలో జిన్నాదేవియెడ నత్యంతానురాగయుక్తుడై యుండును. చిన్నాదేవి నందఱివలెగాక ప్రత్యేకానురాగముతో జూచునని యెల్లరకును దెలియును. రామకృష్ణునితో గూడ రాయలు చాలసార్లు 'కవిచంద్రమా! ఇందఱు సతులలో నాకొక్క చిన్నాదేవియెడలనే యంత యనురాగ మేల యుండవలయును? నిజముగా నిది పూర్వజన్మ ఋణానుబంధమైయుండు ననెడివాడు. రామకృష్ణు డొకటిరెండుసార్లట్లు విని 'రాజేంద్రా! నాకొకసందేహము భయము కలుగుచున్నది. 'అతి సర్వత్రవర్జయేత్తను సూత్రానుసారము, అధికానురాగము, అపరిమితప్రేమ తుదకు వైరముగాఁ బరిణమించుట సహజము' అనెను. రాయలు 'వెఱ్ఱివాడా! చిన్నాదేవి యెడ నాకీజీవితములో భేదాభిప్రాయ మెన్నడును కలుగదు అనెను.

కొన్నాళ్ళకు రాయ లొకనాడు చిన్నాదేవితో గలిసి సౌధముపై యంతస్తున గూర్చుండి మలయమారుత సౌఖ్యము ననుభవించుచు నేవోకొన్ని ప్రశ్నలడిగెను. చిన్నాదేవి తన పుట్టినింటివారిం గూర్చి

యేదో యాలోచించుకొనుచుండుటచే నాప్రశ్నలకు సమాధానము బలుకకదాయెను. 'ఏమూపరధ్యాన' మని రాయలు హెచ్చరింపగా నామె పక్కున పెద్దగానవ్వెను. రాయల కానవ్వు సంతసముకల్గించుటకు మాఱు హాస్యము కలిగించెను. కోపోద్దీపితు డయ్యెను రాయ లామె నేమియు ననక యటనుండి వెడలిపోయెను. దినములు, వారములు, మాసములు గడచెను. రాయలు చిన్నాదేవి యంతఃపురమున కరుగడాయెను.

చిన్నాదేవి దయార్ద్రహృదయయగుట నందఱిగౌరవమునకుఁ బాత్రురాలాయెను. ఆకారణమున రాయ లిట్లకారణముగ నామెతో మాట్లాడుట మానెనని వినిన వారందఱును వర్ణనాతీతమగు ఖేదము నొందిరి. రామకృష్ణునకు జిన్నాదేవియెడలగల గౌరవమునకు బరిమితి లేదు. అతఁ డామె యంతఃపురమునకుఁబోయి. జరిగినదంతయు దెలిసికొని 'అమ్మా! రాయలు నీయెడ ప్రసన్నుడగుటకు చక్కని యుపాయముం బన్నెదను. కొలది దినములు వేచియుండు'మని ధైర్యము చెప్పి రాయలుకడ కరిగి 'మహాప్రభూ! నాకు జిరకాలమునుండి కాశీ రామేశ్వరయాత్రల జేసి రావలయునని యున్నది. మఱల నొక మాసములో వత్తు'నని పలికి, కొంతధనము దీసికొనెను. ఆతడు వారణాసికిఁ బోవక రహస్యముగా నింటనేయుండి బంగారముతో వడ్లగింజల జేయించి, యొకనాడు అర్ధరాత్రివేళ నూరివెలుపలనున్న సత్రములోనికేగి, తెల్లవారినపిదప తాను వారణాసినుండి తిరిగివచ్చితినని కబురంపెను. రాయలు మంగళతూర్యారావములు భోరుకలంగ, రామకృష్ణకవి నూరేగించి, తన సౌధములోనికి గొనిపోయి 'రామకృష్ణకవీ! విశేషములేమి?' యని ప్రశ్నింప నాతఁడు మహారాజా! కాశీలో సదానందసాధువను గొప్పసన్యాసి నాశ్రయించి, బంగారు వడ్లగింజల గొనివచ్చినాను. బంగారపు ధాన్యము పండును'అనెను.

ఆ వడ్లగింజల బాతిపెట్టింపదలంచి 'రేపే శుభదినము. రేపు బాతిపెట్టుదమా?' యనెను. సరేయని రామకృష్ణుడు పలికి, మఱు నాటి సాయంకాలము రాయలు, ఆవడ్లు మొలిపించుటకు దున్నించిన స్థలముకడకు వెళ్ళెను. ఆవింత చూచుటకు బెక్కుమంది పౌరులు, కవులు నరిగిరి. రాయలు 'ఇక నవశిష్టమే'వని యడుగ రామకృష్ణుడు 'మహాప్రభూ! ఒక స్వల్పవిషయమును దమతోఁ జెప్పమఱచినాను. పెద్దగా నవ్వనివారే యీవడ్లగింజలను బాతిపెట్టుట కర్హులు'అనెను. 'ఎవరు గట్టిగా నవ్వనివారుందురు? అందఱును రెప్పుడో యొకప్పుడు గట్టిగా నవ్వితీరుదురు'అని రాయలనగా రామకృష్ణుడు 'ప్రభువువారు గట్టిగ నవ్వనజాడ కానరాదుగదా. తాము చల్లవచ్చును'అనెను. అబ్బే! నేను జాలసార్లు గట్టిగ నవ్వియుంటిని'అని రాయలునుడివెను.

'తమ సతియగు చిన్నాదేవిగారు నవ్వరేమో?'

'ఆమెకూడ నవ్వును. అందఱును నవ్వుదురు గట్టిగా నవ్వనట్టి వారీప్రపంచములో నెవ్వరుండరు.

'ఆవిషయ మెఱిఁగి తామెట్లు చిన్నాదేవిగారితో మాట్లాడుట యంతఃపురమునకు బోవుట మానినారు?'అని రామకృష్ణుడు ప్రశ్నించి నంతనే రాయలు సిగ్గుపడి కారణము లేకయే ప్రేమానురాగమూర్తి యగు నామెను బరిత్యజించి, మహాఘ మొనర్చితినని గ్రహించి 'రామకృష్ణకవీ! నాకు జక్కగా బుద్ధిచెప్పినా'వని పశ్చాత్తాపము నొంది చిన్నాదేవి నెప్పటియట్ల గౌరవింపసాగెను. రామకృష్ణకవి యొనరించిన మహోపకారమునకు గృతజ్ఞతాపూర్వకముగ జాల ధనమిచ్చి సత్కరించెను.

---

## 31 పట్టెడు మెతుకు

'రాయలకడ సెలవుగొని రామకృష్ణకవి మఱొకసారి నెల్లూరు నకు బోయెను. శ్రీమతియను వేశ్య యఖండపాండితీవిభాషితమైతన్ను వాదమునగాని, మఱియేవిషయమునసైనగాని గెలిచినవారితో భోగ సాగర తరంగముల నోలలాడుటయేగాక వేయి దీనారముల నిచ్చెద' నని ప్రకటన మొనరించి యుండెను. రామకృష్ణు డామె నెట్లయిన నోడించి యాబహుమానము దానొందవలయునని తలంచి, యొకనాటి సాయంసమయమున గడ్డిమోపునెత్తుకొని యావేశ్య యింటికడ కేక వైచెను. ఆమె 'అబ్బీ? గడ్డిమోపెంత?' అని యడిగెను. 'ఆఁ! తగిలి నది. బేరము లేదని తలంచి, పట్టెడు మెతుకుల కిచ్చెద' ననెను.

'అయితే ఆదొడ్డిలో బడవేయు'మని యా శ్రీమతి పట్టెడన్న ము తెచ్చి 'బట్టపట్టు' మనెను—రామకృష్ణుడు 'పాండిత్యమున నను మానినని గర్వించుచున్నావు. పట్టెడు మెతుకున కిచ్చెదనంటిని గాని పట్టెడన్నము కంటినా? చక్కగా ఓడిపోయినావు పందెమొడ్డిన వేయి దీనారములను గు'మ్మనెను ఆమె యోడితినని యొప్పుకొని యా రాత్రి యాతనితో సౌఖ్యార్ణవ తరంగమాలికల దేలియాడి వేయి దీనారములనుయిచ్చెను. రామకృష్ణుడు విజయనగరమునకు దిరిగివచ్చి రాయల కీసమాచారము నెరిగించి యాహ్లాద మొదవించెను.

---

## 32 తాతాచార్యుల కవమానము

వృద్ధుడయ్యును తాతాచార్యులు వేశ్యలగృహమునకు దఱుచుగా వెళ్ళుచుండునని యెవ్వరో చెప్పుటచే రామకృష్ణుఁ డొకనాఁడు 'ఆచార్యులవారూ! తాము గతరాత్రి వేశ్యయగు చంద్రిక గృహ

మున కేగినారా లేదా? నిజము చెప్పుడు లేనిచో రాయలకీ సమాచారము దెలిపితీరుద' ననఁగా తాతాచార్యులవారు 'రామకృష్ణా! నీవు దేవాంతక నరాంతకుడవు. నీతో నసత్య జెప్పినచో లాభము లేదు. వారవనితా గృహమునకు నేనేగినది సత్యమేకాని నీపుణ్యమాయని యెవరితోడను జెప్పి, నన్నపహాస్యము పాలుచేయకుము' అని ప్రతిమాలిరి.

'అట్లయిన నన్నెత్తుకొని యిటునటు త్రిప్పుడు' అని రామకృష్ణుడు పలుక, చేయునది లేక తాతాచార్యుల వారాతనిని భుజములపై నెక్కించుకొని యటునిటు తిరుగసాగిరి. అంతఃపుర సౌధముపై నున్న రాయలదిచూచి భటుల బిలిపించి 'ఓరీ! అదుగో! తాతాచార్యులవారి భుజములపై రామకృష్ణు డెక్కినాడు. వెంటనే వానినిటు లీడ్చుకొనిరని డనెను. రాయలు సంజ్ఞచేయుట చూచిన రామకృష్ణుడు వెంటనే క్రిందకురికి 'ఆచార్యులవారూ! మహాపరాధిని క్షమింపుడు. మిమ్ము నేనెత్తుకొందును' అని ఆయన వలదనుచున్నను యెత్తుకొని గంతులు వేయసాగెను. ఇంతలో భటులువచ్చి, రామకృష్ణుని భుజములపై నెక్కియున్న తాతాచార్యులవారినిఁ గ్రిందఁ బడద్రోసి యీడ్చుకొనిపోయిరి. రాయలు ఇదియేమిపనిరా! తాతాచార్యుల వారిని గొనివచ్చిరి?' అని భటులనడుగ, వారు 'మహారాజా! పైనున్న వానినేగదా తాము తీసుకొని రమ్మని సెలవిచ్చినది?' అని యనిరి. రామకృష్ణుని యుపాయమునకు విస్మితుడై రాయలు మన్నించెను.

---

## 33 పాండురంగ మహాత్మ్యము

తెనాలి రామకృష్ణకవికి మొదట రామలింగమను పేరుగూడ కలదనియు, నితఁడు శివభక్తియుక్తుడై లింగపురాణము నాంధ్రీకరించె

నవియు గొందరు చరిత్రకారులు చెప్పుదురు గాని యీతడు రచించె నని చెప్పబడుచున్న లింగపురాంధ్రీకరణగ్రంథ మిప్పుడెచ్చటను గానరాదు. కాని యీతని విరచితములైన చాటుపద్యములలో గొన్నిటియందు రామలింగమనియే ప్రయోగించుకొని యున్నాడు.

ఉ. లింగనిషిద్ధుఁగల్వలచెంగని మేచకకంధరుంద్రిశూ
లింగని, సంగతాళిలవలింగని కర్థమదూషితస్మృణా
లింగనిఁ గృష్ణచేలుని హలింగని నీలకచన్ విధాతృనా
లింగని, రామలింగకవి లింగనికీర్తి హసించుదిక్కులన్.

పాండురంగ మహాత్మ్యము నీతడు గొన్నాళ్ళయినపిదప విష్ణుభక్తుడై విరచించెనని చెప్పుదురు. ఈ యుత్తమ కావ్యమును రామకృష్ణకవి యొక్క జాగీరుదారయిన పెదసంగమరాజుకడ ప్రధానిగా నుండిన విరూరివేదాద్రి కంకితమొసంగెనని ఈ క్రిందిపద్యమువలన బ్రస్ఫుటమగుచున్నది. ఈ విరూరివేదాద్రిగురువు కందాళయప్పలాచార్యులవారు. ఈయన సారంగుతమ్మకవికిని గురువై యుండెను.

సీ. 'వేదమార్గప్రతిష్ఠాదైవతజ్యేష్ఠుఁ
డభ్యస్తషడ్దర్శనార్థరాశి
యతిరాజరచిత భాష్యగ్రంథనిర్ణేత
యఖిల పురాణేతిహాసకర్త
బంధురదివ్య ప్రబంధానుసంధాత
పంచసంస్కారప్రపంచచణుఁడు
వాధూల మునిచంద్ర వంశవర్ధనమూర్తి
సకలదేశాచార్య నికరగురువు
గీ. పట్టమేనుంగు శ్రీరంగపతికినణ్ణ
గారిగరాంబురాశి నాహారరస్మి

సారసాహిత్య సర్వస్వశయ్యాపేటి
యావళందారు కందాలయప్పగారు.'

విరూర వేదాద్రినిగురించి—

సీ. తనకులాచారవర్తనవైష్ణవాచార
పర్యాయముల కొజ్జబంతియనఁగఁ
దన సూక్తము పురాతన సత్కవిధులయు
న్నతికిఁ బునఃప్రతిష్ఠితముగాఁగఁ
దనబుద్ధి నీతిశాస్త్రరహస్యములు
తెల్లముగఁ దెల్పునాఖ్యానముద్రగాఁగ,
దనవాయుగంటంబు మొనవాఁడివిశ్వంభ
రాప్రజలకుఁ బ్రాణరక్షగాఁగ

గీ. వెలయుమంగయ గురువగు విభునిపెద్ద
నంగభూపాలమణి వాయుశప్రవర్త
అయయుతుండైన రామానుజయ్యసుతుడు
భద్రచారి విరూరి వేదాద్రిశౌరి.

# పాండురంగ మాహాత్మ్యము నందలి
# ప్రబంధ పద్యరత్నములు

సీ. అవతారమందె నే యఖిలైక జననియంత్రి
  కలశరత్నాకర గర్భభూమి
దోఁబుట్టువయ్యె నే తొలుత కాంచనవర్ణ
  వెలది వెన్నెలగాయు వేల్పునకును
నాయకయుండు నే పరమపావనమూర్తి
  చక్రిబాహామధ్య సౌధవీథి
నభిషేకమాడు నే యభివర్ణితాచార
  దిగ్గజానీత మహా తేటనీట
తే. నవనిధానంబు లేదేవి జ...సరకు
లమ్మహాదేవి శ్రీదేవి యాదిలక్ష్మి
సరసశుభదృష్టి రామానుజయ్యసుతుని
నాదరించు విరూపా వేదాద్రినాథు.

సీ. సూత్రవతీదేవి సొబగు పాలిండ్లపై
  మలుపచ్చిగంధంపు వలపుతోడ
శిరసులు వంచు నిర్జరకోటిఁ బసిగొను
  లెపసియ వేత్రహస్తంబుతోడ
బనియేమియని విన్నపము సేయు సుమనోర
  థములయిన దివ్యాయుధములతోడ
బ్రహ్మాండకోటుల పారుపత్తెము లెల్లఁ
తే. శార్ఙ్గిన్ రెండవమూర్తియై జగములేలు
మునిమనోహారి శ్రీసేవ ముదలియారి

చేయుపనులెల్ల సఫలముల్ చేయుఁగాత
మలరిరామానుజయ్య వేదాద్రిపతికి.

సీ. ధరణీధరముఁదాల్చు తన చేవయంతయు
భుజనరిఘంబులఁ బొంకపఱచి
మునుమిన్కగనిదైన తన ప్రజ్ఞయంతయు
మతివిశేషమునందు మస్తరించి
దైతారివశమైన తన చిత్తమంతయు
నినుచు గౌరవమున నివ్వటించి
తనువువెన్నెలగాయు తనమూర్తి యంతయుఁ
గీర్తివైభవమునఁ గీలుకొలిపి
తే. శేషుడఖిలప్రపంచవిశేషశాలి
నిత్యముక్తుల కాద్యుఁడై నిలుచుమేటి
చారుచారిత్రు రామానుజయ్యపుత్రుఁ
గరుణవేదాద్రి మంత్రిశేఖరుని మనుమ.

సీ. తనకులాచారవర్తన వైష్ణవాచార
పర్యాయముల కొజ్జ బంతిగాఁగఁ
తనసూనృతము పురాతనసత్యనిధుల యు
న్నతికిఁ బునఃప్రతిష్ఠితముగాఁగఁ
దనబుద్ధినీతి శాస్త్రరహస్యములు తెల్ల
ముగ దెల్పువ్యాఖ్యాన ముద్రగాఁగఁ
దనప్రాయుగంటంబు మొనవాఁడి విశ్వంభ
రాప్రజలకుఁ బ్రాణరక్షగాఁగఁ
తే. వెలయు మంగయ గురునభూవిభుని పెద్ద
సంఘుభూపాలమణి ప్రాయనప్రవృత్తి

జయయుతుండైన రామానుజయ్యసుతుఁడు
భద్రగుణసీరి విరూరివేద్రాద్రిశౌరి.

సీ. సంహృతాంహస్స్ఫూర్తి సింహాసనుండు నృ
సింహవిక్రముఁడు నృసింహశౌరి
త్రయ్యంతవాసనాగ్రహబుద్ధి నొయ్యారి
యొయ్యారి రామానుజయ్యగారు
గంగాతరంగ సారంగలాంఛనదీప్తిఁ
బొందుకు కీర్తికి రంగరాజు
శరణాగతత్రాణ కరుణాచరణకేళి
వరదరాజులబోలు వంశరాజు

తే. వనఁగ శ్రీరామవిభునికి నంబశున్న
గలిగి రాచంద్రతారార్కగతిఁ బ్రశస్తి
నలువురాత్మజు లౌదార్య సలిలనిధులు
భుజగశాయికి నాలుగు భుజములట్లు.

సీ. సమకూర్పఁగా నేర్చు సకలవైష్ణవశాస్త్ర
సిద్ధాంతశుద్ధాంత సిద్ధిగరిమ
పావణింపఁగా నేర్చు నఖిలావని చక్ర
సామ్రాజ్యపూజ్య విశాలలక్ష్మి
వలసింపఁగా నేర్చు వాలారుఁజూపుల
కోపులు చూపు చకోరదృశల
బాలింపఁగా నేర్చు బాంధవ కవిగాయ
కార్థార్థినివహంబు ననుదినంబు

తే. దండనాథునిమాత్రుఁడె దశదిశావ
కాశ సంపూర్ణవిజయ ప్రకాశశాలి

రంగయామాత్యవరదయ్య ప్రకటశౌర్య
ధారివాచాధర ధారికయ్య

సీ. పట్టువస్త్రమయును బరిపుష్టికట్టు
గుడిసున్నకియ్యయు సుడియముడియు
నైత్యంబు నేత్వంబు నందంబు మందంబు
గిలుకయు బంతులు నిలువు పొలుపు
నయము నిస్సందేహతయు నొప్పుమురువును
దచ్చివేశినయట్లు తనరుటయును
షడ్వర్గశుద్ధియు జాతియోగ్యతయును
వృద్ధిప్రియంబును విశదగతియు

తే. గీసుకొనివ్రాయసంబులు వ్రాయవ్రాయ
గొంకుకొసరును జేతప్పు గొనకయుండు
లలితముక్తాఫలాకార పలసనమున
మతిమరున్నన్ని వేదాది మంత్రివరుఁడు.

తే. మాంద్రిమీఱు విరూరివేదాద్రిరాజు
దాన ధారార్ద్ర నఖిలప్రధాననదుల
వెచ్చపెట్టుకిట దలయో విబుధతటిని
తరుశశిమౌళిజడలలో డాఁగియుండు.

సీ. కరుణించిచూచెనా కలిగాయకార్ధార్థి
నివహగేహంబుల నెఱియుసిరుల
కోపించిచూచెనా కొండలో నెనవచ్చు
ననవచ్చు నత్తైన నవనిదూఱు
మెచ్చి మన్నించెనా మెదుగ పాలసుదైన
దొరతనంబునచ్చి పరిఢవించు

బొందుగావించెనా భువినెట్టి ఖలునకు
నాదట కరుణాప్రసాద మొసంగు
గీ. మంత్రిమాత్రుండై దుర్మంత్రిమధవకధన
చారుచర్చాచమత్కార చక్రవర్తి
యద్రివిభుఁడు విరూరి వేదాద్రి రామ
భద్రపాదసరోరుహ బంభరంబు

సీ. వృషభేంద్రగమనుఁడీ వేదాద్రినాథుండు
గిరిరాజతనయ యీతిరుమలాంబ
వేదనిశ్వాసుండు వేదాద్రినాథుండు
ధృతి శారదాంబ యీతిరుమలాంబ
విహగేంద్రగమనుఁడీ వేదాద్రినాథుండు
శరధితనూజ యీతిరుమలాంబ
విబుధాధినాథుఁడీ వేదాద్రినాథుండు
ధర శచీదేవి యీతిరుమలాంబ
గీ. యనగననుకూలదాంపత్య వినుతమహిమ
హరువుదీపించెనౌర వేదాద్రివిభుఁడు
హరియశుండైన కలకాళహస్తి తనయ
తిరుమలాంబయు నిత్యవర్ధిష్ణులక్ష్మి.

సీ. శ్రీకలోదయవధూలోకానన ప్రభా
నాటితబహుచంద్ర నాటకంబు
సమవిర్ధగళిత భాషారత్నమంజరీ
యోజితకథా ప్రపూజనంబు
కైలాసశైల సంకాశ సౌధనివేశ
కౌముదీకవచిత గగనతలము

విస్తీర్ణ పణిపణ్య స్థవస్తువ్రజ
ప్రకటితరత్న గర్భాజఠరము

తే. విపులపవమాన తాండవ వేపమాన
లాంఛనధ్వజపటల పల్లవలలామ
మాళికచితకళాకృత్య హేళిహాయము
దీపితంబగు శ్రీకాళికాపురంబు.

సీ. పద్మినీపద్మాత పత్రంబు శిథిలప
త్రాగమై రాయంచ యాశ్రయించె
దాలుద్రవత్ఫేన జాలంబుతో ఘోణివి
పంచలరొంపి వలంచి యాడె
దూరోద్గమద్దావధూమ మంబుదబుద్ధి
నెమ్మిలోపొదనుండి నిక్కిచూచె
జఠరస్థజలము నాసానాళమునఁ బీల్చి
సామజంబిరుప్రక్కఁ జిల్లుకొనియె.

తే. సరసిపైనీరు కలకల దెరలి విపిన
సకలవిధులు నిర్ఝరగోచ్చయములయ్యె
మిట్టమధ్యాహ్నమిది సుధామధుర వాణి
యర్హమిచ్చోఁబథశ్రమ ముపనయింప.

సీ. పీడియం బెడలించి విధురత్నకనకాలు
కాంచితాంబువు పుక్కిలించి యుమిసి
యుదిరి బాగరువ్రాత హారంబట్టు వలెవాటు
సడలించి వెనఁగట్టి స్థలినిజుట్టి
యనయాయి పృథుకహస్తాంతరన్య స్తోప
దోచితార్థము తానె యుద్వహించి

యంగుళీసంజ్ఞ సమయములఁ బ్రత్యేకంబు
మానుముల్వలోనికిఁ జననొసర్చి
తే. ద్వారపార్శ్వస్థ వేధికాలువల జరక
రక్షివర్గంబు టంక్రియూరభటి వఱలు
వలయమకూటాదికంబుగ నిలచి మ్రొక్క
నగవుఁ జూచుచు నాతఁడు నగరుజొచ్చి
సీ. సనకసనందనాది నిఖిలాంతర్వాణి
హృల్లీనభావంబు నల్లపెట్టి
విశ్వంభరాభోగ వివిధమూర్త్యంతర
స్ఫురితానుభావంబు బుటలువైచి
శింశుమారాకృతి స్వీకృతి వైకుంఠ
మట్కవిహారంబు జారవిడచి
క్షీరోజమధ్యస్థలీ రత్నసగజూపా
గర్భనివాసంబు కచ్చువడలి
తే. పుండరీకేక్షణుండు శిఖండిబర్హ
మండితశిఖండకుఁడు సతాఖండలుండు
పుండరీకుని మానసాంభోపీఠి
మిండతుమ్మెదవైయుండు నిండుకొలువు.
సీ. తనువుతోఁ జరియించు ధర్మదేవతవోలె
మెలఁపున వనవాటిఁ గలయదిరిగి
గణనమీఱి శార్జ్గిగుణములు హృదయసం
పుటినించు క్రియవిరుల్ బుట్టఁబెట్టి
తనకుఁ బవిత్రవర్ధనమె కృత్యంబను
కరడ నూతసకుశోత్కరము గూర్చి
యపవర్గ ఫలసిద్ధి హాణీనైనఁ జేపట్టు
కైవడి బహుఫలోత్కరము లొడిచి

తే. యోగయాగంబుసలుపుచో నూర్మిపశువి
శంసన మొనరించుటకు యూప సమితి దెచ్చు
భాతిసమిధలుగొని మహాప్రాజ్ఞుఁ డొకఁడు
వచ్చుతేఁ బగటికి నిజావాసమునకు.

సీ. యతిమనోగృహదీపి కాంకూరముగు లీల
గోవర్ధనాచల గుహ మెలఁగుచు
గిరికూబతటగట త్కేకిరాజమురీతి
రాధగన్దనమీఁద ప్రాలి నగుచు
జిత్రాభ్రములనేలు సుత్రాము కైవడి
బలువెన్నియాలమందల మెలగుచు
గమల కాగనమధ్య కలహంస విభుభాతి
గూర్మి నిచ్చెలిపిండుగొని చెలగుచు

తే. చంద్రబింబమానకు మృదుస్వనము గఱపు
రచస సంజ్వార్థ శరమూఁదుచు నొనర్చు
నాటలన్నియుఁ జాలించి యరిగెఁ దపసి
పర్ణశాలకు దేవకీరత్నకంబు.

సీ. నీటిలోఁ జివుకక నిలిచి క్రమ్మఱు పూన్కిఁ
గఠినకర్పరిపుఁజుకాంకను బిగువు
దంష్ట్రనెత్తిసమహేతలపుఁ డుపుఁ జీర
యురుదారుకలశయం దుదయమగుట
పరులకు దనకట్ల బలిమి చూపువిధంబు
పునిమిన నెత్రు గుగ్గిలపునూనె
ద్వీపాంతరమునకుఁ దెగువమైఁ జనుపెంపు
చేముట్టునాగంటి జీనుతగులు

తే. సాగరాగమమాలిమి శాస్త్రసరణి
వల్లువల్లన చిత్రధావనము గల్గు
నిన్నుఁ దరిచేసి, భవదార్ధిని స్తరించి
దరిఁ దఱియకున్నఁ గలదె మోదము మురారి.

సీ. తుఱుచలై గుమురులై గొనబులై తేఁటాప
గొమ్ముజుట్టినజడల్ గుమురుకొనగ
మెఱుపుల మిట్టలై మిక్కిలి బటువులై
గ్రాలుకన్నులచెన్ను గబ్బుదేర
చక్కనై చెలువమైన చిన్నదియై యొప్పు
మోము దంష్ట్రాటంకముల దలిర్ప
నీలమై నిబిడమై నింగి కిం
దుగనున్న బలుమేని పొగరు మెఱయ
తే. ప్రతిపతి కేతనుని పురఃక్షేత్రమూది
యున్న శ్రీక్షేత్రపాలకు యోగిలోక
రక్షణుముప్పది రెండక్షరముల మంత్ర
రాజను జపించికొల్వ దొరకుశుభములు.

సీ. నిడువాలుగను చూపు నిగిడినచోనెల్ల
బీరెండ రేయెండ బెండ్లియాడి
నిశ్వాసపవనంబు నెనరుచోనెల్ల
ప్రాభిమ్ము నత్తావు లాముకవియఁ
బాక్కుటితమ్మిపు ష్పాడితాల్కుచోనెల్ల
బ్రహ్మాంకురంబులు ప్రాదుకొనఁగ
నడుగు లెజిగుర్లాకు లంటినచోనెల్ల
వివిధతీర్థశ్రేణి వెల్లివాడవ

తే. బర్హామణిబంధ మావేల్పుపచ్చనెదుఱ
గ్రచ్చకాయలతిత్తియు గంబుశక్తి
గలిగి విహరించు బౌండరీకంబునందు
నందులేబట్టి ప్రాలేయ నగముపట్టి.

సీ. నగధ్వని వాహనంబగు గోవృషముఱంకె
లనమొల్చు ఘంటామహాక్వణములు
హరశిరశ్శశిరేఖ యపరావతారంబు
లనబొల్చు సేవాగతాబ్జముఖులు
కాద్రవేయాకల్ప కంఠమూలచ్ఛాయ
లనబొల్చు నగరుధూపాయతంబు
లీసానభూషణాహిస్ఫటా మణికాంతు
లనబొల్చు రత్నదీపాంకురములు

తే. ఖండపరశుతనుప్రభా ఖండదుగ
జలధికలసీకరములన బొలుచువేల్పు
టెలికలుచల్లుపూవుదోయిళ్ళగిల్లు
నగము మునిముఖునకు దృగానందమొసగె

సీ. చలిదిచిక్కపుజిల్లు సాలుముల్ కాసుపై
నొయ్యారముగ పింఛ మొయ్య జెరివి
భాస్కరాంశులు దూటి పానుప్రేల్వీనుల
వెలలేని మకరకుండలములునిచి
మోచేతివంపుగా ముడిచిబట్టిన కేల
వరదాభయంబు నాపటముజేసి
పొలలేనియరటుల నిరసించుమృదులోరు
యమళమధ్యమున గోయష్టినిలిపి

తే. నిగమనూపురములు మ్రోయ నిఱుకుళముగ
సిగ్గువాసినకటి ప్రకాశింపనురము
కెంపులేమెడఁ గ్రక్కఁజెక్కిళనగవు
మొలవ నత్తీర్థమునవిల్చిపొల్చు చక్రి.

సీ. కలదు లేదను వాదములకోర్చి మీనుమీ
సమువంటి ఱొంటిజంగము మెఱవఁగ
లహుసుంకుమదపంక పాణింధమంబైన
తాళిగోణపుఁబెంగు నేలజీరఁ
గడలేని వీడ్యంపుఁ గప్పుచుందురుకావి
మోవివల్లొత్తుల ముసుఁగుదన్న
పానతాఁకులుగల్గు సూనాస్త్రశంఖంబు
గతి నఖరేఖాంక గళము దనర

తే. సఖులు పరిహాసకులు వెంటజనగ యువతి
భుక్త నిర్ముక్త పరిధాన యుక్తుడగుచు
నగరుగంటాపథంబున నగుచుదిరుగు
నొఱపుగలఠీవి జాతిమాత్రోపజీవి.

సీ. పరమేష్టినుండి నీతరముదాక కశుద్ధ
తరమయినవంశంబు దలచవైతి
దఱిద్రొక్కియున్న యీతల్లిదండ్రుల జాల
పఱచవై సంతోష పఱచవైతి
నగ్నిసాక్షిగ బెండ్లియాడిన యిల్లాలి
నిల్లాలితాకార నొల్లవైతి
ధర్మశాస్త్రార్థవిత్తముల విత్తములచే
నలరించి విఖ్యాతి నందవైతి

తే. శీలమఖిలంబునిది పిల్ల శీలమనుచు
జదువులివియెల్లఁ జిల్కల చదువులనుచు
దోడివారలునవ్వ నాతోడ! యేల
బేలవైతివి యీగుణం బేల? నీకు.

సీ. మహినాలపాఁడి మర్మంబుగాఁ బ్రభవింప
నవనవోజ్జ్వలరధి స్నానవిధియు
శుభ్రాభ్రపటలంబు లభ్రంబుపైఁ బర్వ
లఘుభౌతవిమల చేలములకప్పు
సితకుశేశయ కాళ సితకరద్యుతిహెచ్చ
దొరకినయుచితంపు విరులఘాజ
శాలిపాకస్ఫూర్తిగ్రాల గోరోచనా
నమ్రశ్చప్పిక్య సంఘటనము

తే. నభ్రభుజాభోజనములుక్రొం బంటవంట
కములుగావింప గోధూమఖండఖండ
శర్కరాఢ్యసుపక్వ భోజ్యములు నెరపి
విష్ణుఁబూజింపఁదగు పరద్వేశియందు.

సీ సమధికజ్ఞాన విభ్రమముతో గూడంగ
హరిమేన నవతార మైనవారు
మతమువోవగఁ నిండు మనసుతో గూడంగ
బ్రహ్మచర్యము చిక్కఁ బట్టువారు
పరపురుషార్థసంపదలతోడఁ గూడంగ
ధనురాది శస్త్రము ల్దాల్చువారు
ద్వీపాంతరమునకుఁ దెగువమై జనువుంపు
చేముట్టుఁనాగంటి జీనుతగులు

తే. సౌగతాగమమాలిమి శాస్త్రసరణి
వల్గువల్గక చిత్రధావనముగల్గు

నిన్నుఁ దరిచేసి భవవార్ధిని స్తరించి
దరిదఱియకున్నఁ గలదె మోక్షము మురారి.

సీ. కరకుండినఁ జూచి యొక్కింతనగి కృష్ణుఁ
డిది యేమి నీవన్న నిందువదన
కుంచితావయవతం గుఱుసమూర్తి దత్పాద
బిసరుహంబుల కేలి బిగియఁబట్టి
యుచ్చిత్తహారములో మనవైరి! నీపాద
వనరుహంబులు పిసనదలజాల
వీనిలావణ్య మీవేషభూషణముగా
నస్మత్కరార్థి తంబగుట సమగు
తే. గవయిది చలాంఛనం బగుగాఁతయనుడు
నట్లయగుగాక సర్వంబు సబల! నీవ
నంబరవిముక్త కేశవి నఖిలభూష
ణాంచి తాంగివినైయుండు మనియె శౌరి.

సీ. కాంబరీకచ్ఛ పేశ్వరకంకరముదీప్త
తాసింధ వల్లిమ తల్లియనగ
బవనసారణపతి స్ఫాటికిస్తంభజం
ధద్విపన్మణిపాల భంజయనగ
సవనతరాహాధం ప్రాఖవిత్రప్రోత
కలకాషుఘవకాల ఖండమనగ
గకుబంతకరివర స్కంధసింధుద్వీప
సంసారకాసిత హంసి యనగ
తే. భూరి భూభృచ్చి భోద్యన్మయూరి యనగ
భృగుభగీరథభరతాది నృపభుజాగ్ర

ఘటితశాలాగరుస్థానకం బనంగ
దగు వసుంధర గృపటల్కు దైత్యభేది

సీ. ఇంద్రచాపంబు గాదిదిమాళితనమున
సవరించి బర్హిపింఛంబుగాని
భిదుర ఘోషంబుగా దిది పాంచజన్యసం
జాతగంభీర ఘోషంబుగాని
యాశ్రయించిన బలాగావళిగా దిది
హారి ముక్తహార యష్టిగాని
యిదిగోల మెరుగుగా దురిబంరంపుగా
గాబసిమిగ్రమ్మెడు పచ్చపట్టునీ
తే. వృష్టిగా దిది కరుణాబు వృష్టిగాని
నీలమేఘుంబుగా దిది నీలవర్ణుఁ
డౌర నాత్రమోలఁ బ్రత్యక్షమయ్యెననుచు
హర్షపులకితతనువయ్యె న వ్యధూటి

సీ. కలకసిరెంతయు గతకల్మషము జేసెఁ
గతకాఫలమురీతిఁ గలశసూతి
పాపటదీర్చె భూభాగంబు నాశ్వాస
శాదింబు శకటౌఘ చక్రధార
శిఖితాండవము కళాసికఁ జేసి సదలంచెఁ
గటికుటీకల పేరి కాసెబిగువు
లుడిగిన జడవాన లుదయించె వెండియు
గరిఘుటమవృషి కైతవమున
తే. తెల్లుశోభిల్లె మంకెనలుల్లసిల్లె
గాలకంధరవాహంబు గర్జురేఁగె

ముదితశతగోపకన్యకా వద నతులిత
లలితరుచిబాల్చె రాకాశశాధరుండు.

సీ. వడతు నీక్షేత్రంబు నకుజెయిదాఁచి
యర్చింతు నీనమ్మిన సేవకులను
మ్రొక్కుదు నీపాదములకు జిహ్వావీధి
నీనామములు వక్కాణింతు నెపుడు
అర్పింతు నీసేవకై సర్వదేహంబున
జింతింతునీలీల జిత్తసరణి
దనివోక నీచక్కదనము సంవీక్షింతు
నీయవధానంబు నెమ్మివిందు

తే. బ్రహ్మరుద్రాదులకుఁ గానఁ బడని నీవు
నేడునా మ్రోల నిలిచితి నీలవర్ణ
వర్ణనాతీతమత్ప్రాభవప్రవృత్తి
పుణ్యపరిపాక మేరికిఁ బొగడదరమె!

శా. ప్రారంభించిన వేదపాఠమునకుం బ్రత్యూహమానంచు నో
యేరాతమ్ముఁడ నన్నుఁజూడ జనుదే వెన్నాళ్ళనోయుండి చ
తూరాజీవ యుగంబువాచె నినుఁగన్గోకున్కి మీబావయున్
నీరాకన్మదిఁ గోరుజంద్రుపొడుపున్ నిరాకరంబుంబలెన్.

మ. వలనాయేటికి నాశ్రయించి మనఁగా వానీరమున్ నీరమున్
దలవెత్తేపచరింప నేటికి సమద్ధానంబు దానంబున
చ్చలమాయేటికి నెత్తిఁగట్టుకొనఁగా సన్న్యాసమున్న్యాసముః
గలిఁదేజాలు మదీయభక్తిరుచి భక్తశ్రేణి కశ్రాంతమున్.

సీ. సిలువునవొలిపించె సిలువంగడము నెల్ల
శరముల యాయంబు బొరయుటడిపెఁ
దగశబ్దమాత పాత్రముచేసె గుణలత
మ్రాకునగట్టించె మూలబలము

కంచుకి వశముగావించె సేనానాథు
 గట్టించె సహచరుఁ గటికిమొండ
బ్రతిపక్షభావసంగతుఁడని పంతుజూచె
 వర కేతముఁడుకీర్తి భరముడులిపె
గీ. ధర్మనిర్మలబుద్ధి సుశర్మ గదిసి
గెలువగా లేకచని కోపగించిమదను
దురక పనివాగలతనికి నోడుమని రె
పతికిఁ గీజేటబంట్ల పాపంబుగాదె ?
తే. ఖండపరశుతెను ప్రభాఖండముద్ధ
జలధిజలశీకరములన బొలుచు వేల్పు
శలికలుచల్లు పూవుదో ఁయిళ్ళగిల్లు
నగము మునిముఖ్యునకు దృగానందమొసగె.
సీ. చలిదిచిక్కపుజిల్లు సాలుముల్ కొనుపై
 నొయ్యారముగ పింఛ మొయ్య
శిరివిభాస్కరాంశులు దూరి పాఱుప్రేల్వ్రనుల
 వెలలేనిమకరకుండలములునిచ్చి
మోచేతివంపుగా ముడిచిపట్టిన కేల
 వరదాభయంబు లావటముచేసి
పొనలేని యరటుల విరసించుమృదులోరు
 యమళమధ్యమున గోయష్టినిలిపి
తే. నిగమనూపురములు మ్రోయ నిరుకుళముగ
సిగ్గువాసినకట్టి ప్రకాశింపనురము
కెంపులేమొండగ్రక్క జెక్కిళ్ళనగవు
మొలవ నుత్తీర్థమునరిచ్చి పొల్చుచక్రి.

సంపూర్ణము.

---

శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమంత్రి.

# ఆంధ్రనాటకములు

| | రు. | అ. |
|---|---|---|
| **బళ్ళారి ధర్మవరం గోపాలాచార్యులుగారి** | | |
| రామదాసు | 1 | 8 |
| **బళ్ళారి కె. బాలసరస్వతిగారి** | | |
| భక్తతుకారామ్ | 1 | 8 |
| **గురజాడ అప్పారావుగారి** | | |
| కన్యాశుల్కము | 2 | 0 |
| **బళ్ళారి పండిత కె. సుబ్రహ్మణ్యంగారి** | | |
| కృష్ణలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| కోవాడు కార్యాగ్ని (చరిత్రాత్మక నాటకము) | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము అను లంకాదహనము | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| మిహిర (పద్మిని) | 1 | 8 |
| **ముత్తనేని వెంకట చెన్నకేశవులుగారి** | | |
| తులసీదేవి (సతీతులసి) | 1 | 8 |
| **చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి** | | |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| ప్రసన్నయాదవము | 1 | 8 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| **చందాల కేశవదాసుగారి** | | |
| కనకతార | 1 | 8 |
| **విద్వత్కవి మల్లాది అచ్యుతరామ శాస్త్రిగారి** | | |
| సక్కుబాయి (అసలు స్టేజినాటకం) | 1 | 8 |
| **శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి** | | |
| సావిత్రి | 1 | 8 |

| | రు. | అ. |
|---|---|---|
| **బి. కే. కాళ్లకూరి నారాయణరావుగారి** | | |
| వరవిక్రయము | 1 | 8 |
| పద్మవ్యూహము | 1 | 8 |
| చిత్రాభ్యుదయం (సారంగధర) | 1 | 8 |
| **[illegible]పల్లి లక్ష్మీకాంతకవిగారి** | | |
| సత్యహరిశ్చంద్రీయము | 1 | 12 |
| **సానాపురం అప్పారావు పట్నాయక్ గారి** | | |
| రేవతి | 1 | 8 |
| **శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి** | | |
| బొబ్బిలియుద్ధము | 1 | 8 |
| **పిష్ణుభట్ల సుబ్రహ్మణ్యంగారి** | | |
| సారంగధర | 1 | 8 |
| **కాజ రాధాకృష్ణశాస్త్రిగారి** | | |
| జన్మభూమి | 1 | 8 |
| అమరజ్యోతి | 1 | 8 |
| మాధవశర్మ | 1 | 8 |
| ఝాన్సీరాణి | 1 | 8 |
| **వేదాంత కవిగారి** | | |
| తెనుగుతల్లి | 1 | 8 |
| ఆకలిమంట | 1 | 8 |
| కష్టకాలము | 1 | 8 |
| మహారథి కర్ణ | 1 | 8 |
| విశ్వస్వరాజ్యం | 1 | 8 |
| **ఊటుకూరు సత్యనారాయణరావుగారి** | | |
| వీరాభిమన్యు | 1 | 8 |
| అనార్కలీ | 1 | 8 |
| ఛత్రపతి శివాజీ | 1 | 8 |
| అహల్య | 1 | 8 |
| ద్రౌపది వస్త్రాపహరణము | 1 | 8 |

---

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# చరిత్రలు - కథలు

| | రు | అ |
|---|---|---|
| శ్రీనాథకవి చరిత్ర | 0 | 12 |
| వేములవాడ భీమకవి | 0 | 12 |
| తెనాలి రామకృష్ణ | 0 | 12 |
| బమ్మెర పోతరాజు | 0 | 12 |
| శ్రీకృష్ణదేవరాయలు | 0 | 12 |
| నారదుని కథలు | 1 | 0 |
| సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి | 3 | 8 |
| నలమహారాజు కథ వచనం | 0 | 12 |
| పంచపాండవుల అజ్ఞాతవాసం పెద్దది బైండు | 1 | 8 |
| శ్రీరామవనవాసము | 1 | 0 |
| పరమానందశిష్యుల కథలు | 0 | 6 |
| భోజకాళిదాసు కథలు | 0 | 12 |
| భట్టివిక్రమార్కుని కథలు బైండు పెద్దది | 3 | 8 |
| డిటో 200 పేజీలుగలది | 1 | 0 |
| డిటో 100 పేజీలుగలది | 0 | 12 |
| స్త్రీల వ్రతకథలు 1, 2, 3 భా॥ | 1 | 0 |
| రైతుఋణచట్టము | 0 | 2 |
| పాండవవనవాసము | 1 | 0 |
| కాశీక్షేత్రమహాత్మ్యము | 0 | 12 |
| మహాపతివ్రతల కథలు | 0 | 12 |
| మదనకామరాజు కథలు | 1 | 0 |
| హరిశ్చంద్ర వచనం | 0 | 12 |
| మైరావణ చరిత్ర 200 పేజీలు | 1 | 0 |
| ప్రవృద్ధపాండవం | 0 | 8 |
| అభయరాఘవము | 0 | 8 |

| | రు | అ |
|---|---|---|
| సౌభ్రాత్రరాఘవము | 0 | 8 |
| విక్రమరాఘవము | 0 | 8 |
| ఆంధ్రుల కథలు | 0 | 12 |
| ఆంధ్రదేశపు కథలు | 0 | 10 |
| కోటమర్తి కథలు | 1 | 8 |
| పెద్దాపుర సంస్థాన చరిత్ర | 1 | 0 |
| పద్మనాభుని యుద్ధము | 0 | 12 |
| ప్రాచీనాంధ్ర నౌకాజీవనము | 1 | 8 |
| ప్రాచీనాంధ్ర విద్యాపీఠము | 1 | 0 |
| శ్రీకృష్ణుడు | 0 | 4 |
| మోడరన్ విద్యాప్రహసనము | 0 | 2 |
| పురూరవచక్రవర్తి కథలు | 0 | 12 |
| మహాభక్తవిజయం అను 30 భక్తుల కథలు | 1 | 4 |
| అరేబియన్ నైట్సు కథలు కంప్లీటు స్టోరీస్ | 1 | 8 |
| శుకసప్తతి కథలు | 0 | 12 |
| కాశీరామేశ్వర మజిలీకథలు | 1 | 0 |
| గులేబకావళి కథలు | 1 | 0 |
| షట్చక్రవర్తుల ఇంద్రజాలపు కథలు | 0 | 12 |
| భేతాళపంచవింశతి కథలు | 0 | 12 |
| అల్లూరి సీతారామరాజు చరిత్ర | 0 | 6 |
| పన్నెండురాజుల కథలు | 1 | 0 |
| పదహారురాజుల కథలు | 1 | 0 |
| పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితం | 1 | 8 |
| రెడ్డిరాజులు | 0 | 8 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.